

పంచతంత్రం:

# లబ్ధనాశము

చిత్రరచన, నిర్వహణ: విశ్వాత్ముల నరసింహమూర్తి.



(విష్ణుశర్మ - రాజకుమారులతో)
"లబ్ధనాశమను నాల్గవ తంత్రము చెప్పెద వినుడీ బాలకులారా!"



"మూర్ఖుడైన వాడెప్పటికైనా కోతితో మైత్రిని ప్రీతితో చేసీ మోసపోయినా మొసలి చందమున దొరికినదానిని కోల్పోతాడూ!"




పూర్వమొకప్పుడు సంద్రపుటొడ్డున రక్తముఖుడనే వానరమొక్కటి కాపురముండెను మేడిచెట్టుపై.



ఒక రోజున వికరాళముఖుడనే మకరం ఒకటి ఒడ్డుకు వచ్చీ విశ్రమించినది.



మొసలిని చూచిన మర్కటరాజము అతిథి వచ్చెనని ఆనందంలో మేడిపళ్లనూ రెంటిని కోసి మొసలి ముందు పడవేసిందీ.



ఆకలిగొన్న మొసలి ఆత్రముగ పళ్లను రెంటిని మింగేసిందీ.



మేడిపళ్ల రుచి మరిగిన మొసలీ నాటి నుండి ఆ రక్తముఖునితో స్నేహం చేసీ ప్రతిదినమచటికి వస్తూ పోతూ వుండేదీ,
ఇరువురు మిత్రులు ఇష్టాగోష్ఠిని మెలగుచు ఫలములు తనివి తీరగా మెక్కజొచ్చిరి.



ఒక రోజున మొసలింటికి పోతూ మేడిపళ్లు రెండింటిని చేకొని తన పెళ్లానికి బహూకరించెను పళ్లను తిని ఆ పెళ్లామన్నది:- "ఇంత మంచి ఈ పళ్లెక్కడి"వని



"ప్రాణ సమానుడు నా మిత్రుడు కల డత - ఒచ్చెను వీటిని బహుమానంగా!"

"ఇంత తియ్యని పండ్లను తిని జీ-వించే మిత్రుని గుండెకాయ అది- ఎంత మధురమో! నిజముగ నాపై ప్రేమే వుంటే ఆతని గుండెను తెమ్ము వెంటనే! దానిని తింటే ముసలితనం రాదందురు పెద్దలు"



"అయ్యయ్యో అట్లంటావేమే!- పూజనీయుడగు మిత్రుని చంపుట- పాపము కాదా?"

"అది అంతా నాకెందుకు చెప్తావ్!- నాపై నీ మనసుంటేగా? ఎవతెనో వలచా- వందుకె రోజూ ఇంటికి రావడమింతాలస్యం!!"



అంటూ ఆవిడ రుసరుసలాడుతు - కోపగృహంలో ముసుగు తన్నినది.



ఏమి చేయుటకు తోచక మొసలీ - విచారముగ తన మిత్రుని వద్దకు - బయలుదేరినది



"ఆర్యా! గురువర్యా! ఈ కథ నింతకు ముందొకపరి చెప్పినట్లు జ్ఞాపకము?"

"చెప్పితి కానీ దానికి దీనికి ఉన్నదొ కించుక వ్యత్యాసం!"



సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 47
సంచిక 42
**30.6.54**

జయ, జ్యేష్ఠ బహుళ అమావాస్య బుధవారం



“మా పుట్టం మునిగింది?”

—ఫొటో : కె. సావిత్రీదేవి, (కాకినాడ).




**బుధవారం, జూన్ 16:**

—ఫ్రాన్సు ఇండో చైనా నుంచి కొన్ని ఫ్రెంచి సైన్యాలను పుదుచ్చేరికి రప్పించింది. ఈ సైన్యాలు ఎస్. ఎస్. వియట్నాం అనే ఓడలో వచ్చాయి. వీటితోపాటు చాలా ఆయుధసామగ్రికూడా దిగుమతి అయింది. ఇలా సైన్యాలను రప్పించడం అక్రమమనీ, వెంటనే ఉపసంహరించవలసిందనీ భారతప్రభుత్వం తీవ్రంగా తెలియజేసింది.

—ఇండోచైనాలో యుద్ధవిరమణ చర్చ జేసేటప్పుడు కాలంలో పర దేశాలు అంగీకరించాలంటే జెనీవాలో సంప్రదింపులు జరుపుతున్న ఉభయపక్షాలూ తమను ఆహ్వానం పంపించాల్సిందే నని భారత ప్రధాని నెహ్రూ స్పష్టపరిచారు. ఈ విషయం ఆయన సింహళపు ప్రభుత్వానికి తెలియజేశారు.

—థాయిలాండ్ – ఇండోచైనా సరిహద్దులను పర్యవేక్షించడానికి ఐక్యరాజ్య శాంతి పరిశీలకులను పంపించవలసిందని థాయిలాండ్ ప్రభుత్వం భద్రతాసంఘాన్ని కోరింది.

—ప్రైవేట్ పెట్టుబడిదారుల పరిశ్రమలకు టెక్నికల్ సహాయాన్ని అమెరికా నుంచి తీసుకొనేటట్లు ఒక ఒడంబడికపై భారతప్రభుత్వం నేడు సంతకం పెట్టింది.

—టర్కీ పాకిస్తాన్ ఒడంబడికలో ఇజ్రాయిల్ తప్ప మిగతా మధ్యప్రాచ్య దేశాలన్నీ చేరడానికి వీలుందని పాక్ ప్రధాని మహమ్మదలీ అన్నారు.

—కొరియాను ఏకీకరించేందుకు విం చెయ్యాలి అనేది తేల్చుకోడానికిగాను ఏడువారాలుగా జెనీవాలో జరుగుతున్న 19 దేశాల సమావేశం ఏమీ తేలకుండానే భగ్నమైపోయింది. కొరియా అంతటా ఎన్నికలు ఎవరి పర్యవేక్షణకింద, ఎలా జరగాలి అనేది పరిష్కారం కాలేదు.

—ఆంధ్రలో రెండుమూడు పంచదార ఫ్యాక్టరీల స్థాపనకు అనుమతించవలసిందిగా ఆంధ్రప్రభుత్వం కేంద్రాన్ని కోరింది.

—హైద్రాబాద్ ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడుగాను, రివిన్యూ మంత్రిగాను పని చేస్తున్న కొండా వెంకటరెడ్డిగారు అధ్యక్షపదవికి రాజీనామా ఇచ్చారు.

**గురువారం, జూన్ 17:**

—పుదుచ్చేరికి రప్పించబడిన ఫ్రెంచి దళం కేవలం పోలీసులే తప్ప సైనికులు కారని ఫ్రాన్సు భారతప్రభుత్వానికి తెలియజేసింది. కాని భారత అధికారులు ఈ సంజాయిషీని ఒప్పుకోలేదు.

—ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేరవానితిప్ప, కృష్ణాబారేజి ప్రాజెక్టులను, తుంగభద్ర ఎగువకాల్వ, గండికోట, వంశధార, నందికొండ, సిద్ధేశ్వరం, ప్రాజెక్టులను చేర్చాలని ఆంధ్రప్రభుత్వం కేంద్రాన్ని అర్థించినట్లు కర్నూలు వార్త.

—హంగరీ ఇండియా ఎగుమతి దిగుమతి ఒడంబడికపై సంతకాలు జరిగాయి.

—మొదటి పంచవర్ష ప్రణాళిక ముగిసే ఈ రెండేళ్ళలోను విద్యాభివృద్ధికి 5 కోట్ల రూ.లు ఖర్చుచేస్తూ, దేశమంతటా 500 పర్యార్థసాధక విద్యాశాలలు నెలకొల్పాలని ప్లానింగ్ కమీషన్ నిశ్చయించింది.

—కొరియా ఏకీకరణ చర్చలు విఫలమయ్యాయి కనుక దక్షిణకొరియా యుద్ధ విరమణ ఒడంబడికకు కట్టుబడి ఉండదని ద. కొ. మంత్రి ప్యూన్ యంగ్ తాయ్ చేసిన ప్రకటనపై వ్యాఖ్యానిస్తూ, ఉత్తరకొరియన్ ప్రతినిధి పేక్ నాంఉన్ పై ప్రకటన అమెరికన్ కూటమివారి తంత్రాలను బయటపెడుతోందని అన్నారు.

—ఇండోచైనాపై 9 దేశాలు జెనీవాలో జరుపుతున్న సమావేశం విఫలం కావడానికి సిద్ధంగా ఉన్న సమయంలో చైనా కొత్త ప్రతిపాదనలుచేసి సమావేశం కొనసాగేట్లు చేసింది.

—వీలయినంత త్వరలో ప్రాథమిక ఉపాధ్యాయుల జీతాలను పెంచడానికి తాము సుముఖంగా ఉన్నట్లు ఆంధ్ర విద్యామంత్రి పట్టాభి రామారావుగారన్నారు.

—టర్కీతో పాకిస్తాన్ సైనిక సంప్రదింపులు త్వరలో ప్రారంభమౌతాయని పాక్ ప్రధాని మహమ్మదలీ అన్నారు.

—ఫ్రాన్సు నూతన ప్రధానిగా మెండెస్ ఫ్రాన్సు 101 ఓట్ల మెజారిటీతో ఎన్నిక అయ్యారు.

—పుదుచ్చేరి వద్ద ఫ్రెంచి ఇండియా భూభాగంలో ఉన్న తిరుబువనై? అనే భారత గ్రామాన్ని ఫ్రెంచి పోలీసులు చుట్టు ముట్టి బయటి ప్రపంచంతో సంబంధం లేకుండా చేశారు.

—ఆంధ్రదేశంలో విద్యుచ్ఛక్తిఉత్పత్తి కోసం 11 స్కీములను ప్లానింగ్ కమిషన్‌కు ఆంధ్రప్రభుత్వం పంపింది. వీనికి మొత్తం కోటి 64 లక్షల రూపాయలు ఖర్చవుతుంది.

**శుక్రవారం, జూన్ 18:**

—చైనా త్వరలో బ్రిటన్‌లో రాయబార సంఘాన్ని ఏర్పాటు చేయనున్నదని బ్రిటిష్ ప్రధాని చర్చిల్ ప్రకటించారు. బ్రిటన్‌లో చైనా రాయబార కార్యాలయం ఇంతవరకూ లేదు.

—ఇండోచైనాలోని సైగాన్‌కు వెడుతున్న ఒక ఫ్రెంచి విమానం కలకత్తా దండం విమానాశ్రయంలో ఆగగా కలకత్తా కస్టమ్సు అధికార్లు దాన్ని సోదాచేశారు. విమానంలోని 84 గురూ మఫ్టీ వేషాల్లో ఉన్న సైనికులని అనుమానించబడింది

—లావోస్, కంబోడియాలలో వియట్మిన్ సైన్యాలేవైనా ఉన్నట్లయితే ఉపసంహ

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: "సంఘం" లో అంజలీదేవి.

రిస్తామని జెనీవాలో వియట్మిన్ ప్రతినిధులు రాజీ ప్రతిపాదన చేశారు.

—'ఒక నెలలో శాంతిని సాధిస్తాను, లేకపోతే రాజీనామా ఇస్తాను' అనే ప్రతిపాదనపై రాడికల్ వామపక్షానికి చెందిన మెండీస్ ఫ్రాన్స్ ఫ్రెంచి ప్రధానిగా ఎన్నికయ్యాడు.

—గ్వాటిమాలా రాజ్యానికి వెడుతున్న ఓడల్లో ఆయుధాలున్నాయో లేవో తణిఖీ చేయడానికి ఒప్పుకోవలసిందని అమెరికా కోరగా బ్రిటన్ తనఓడలను ముట్టుకోడానికి వీల్లేదని నిరాకరించింది.

—థాయ్‌లాండ్ - ఇండోచైనా సరిహద్దులకు ఒక పరిశీలక సంఘాన్ని పంపించాలని థాయ్‌లాండ్ చేసిన విజ్ఞప్తిని సోవియెట్ యూనియను భద్రతామండలిలో వీటో చేసింది. ఇక ఈ విజ్ఞప్తిని ఐక్యరాజ్య సర్వసభ్య సమావేశానికి పంపదలచినట్లు థాయ్‌లాండ్ విదేశాంగ మంత్రి అన్నాడు.

**శనివారం జూన్ 19:**

—ఆంధ్రా హైకోర్టు నలుగురు జడ్జీలతో ప్రారంభమవుతుందని, ఆ నలుగురూ ప్రధాన న్యాయమూర్తి అయిన కె. సుబ్బారావు, పి. చంద్రారెడ్డి, పి. వి. బాలకృష్ణ అయ్యర్, ఉమామహేశ్వరంగార్లనీ న్యూఢిల్లీ వార్త.

—గ్వాటిమాలాలో 1944 నుండి అధికారంలో ఉన్న ప్రస్తుత ప్రభుత్వం వామపక్షానికి చెందినది గనుక దాన్ని పడగొట్టే ఉద్దేశంతో హొండురాస్, నిగరాగ్వ రాజ్యాలనుండి కమ్యూనిస్టు వ్యతిరేక సైనికులు సముద్ర, విమాన, భూమార్గాలద్వారా దండయాత్ర ప్రారంభించారు. ఈ దండయాత్రకు అమెరికన్ మద్దతు ఉందని ఆరోపిస్తూ, గ్వాటిమాలా ప్రభుత్వం తనపై దురాక్రమణను అరికట్టవలసిందిగా భద్రతామండలిని కోరింది.

—20 వేల మాటలు, 106 ఆర్టికిల్స్ గల చైనీస్ ప్రప్రథమ రాజ్యాంగపు ముసాయిదా ఇటీవల ప్రకటించబడింది సోషలిస్టు విధానం ఎలా ఉండాలో ఇది నిర్దేశిస్తోంది. పెట్టుబడిదారీ పరిశ్రమలను 'ఉపయోగించుకోవడం, తగ్గించడం, మార్చివేయడం' అనే విధానాన్ని అనుసరించదలచినట్లు ఆ రాజ్యాంగంలో ఉంది.

—నందికొండ ప్రాజెక్టు మొదటి పంచవర్ష ప్రణాళికలోనే చేర్చబడుతుందని ఢిల్లీ సందర్శించి వచ్చిన ఆంధ్ర ఆర్థికమంత్రి తెన్నేటి విశ్వనాథంగారు సికిందరాబాద్‌లో ప్రకటించారు.

—నిజాం నవాబు గవర్నరుగా విశాలాంధ్ర నిర్మించాలని ఆంధ్రప్రభుత్వం ఫజిల్ అలీ కమిషన్‌కు నివేదించిందని తెన్నేటి విశ్వనాథంగారు హైదరాబాద్‌లో అన్నారు.

—జెనీవాలోని ఇండోచైనా సమావేశం ఫలించే సూచనలు ఎక్కువైనాయనీ, కమ్యూనిస్టుల రాజీ ప్రతిపాదనలు, పశ్చిమరాజ్యాల రాజీ ధోరణి దీనికి కారణమని జెనీవా వార్త

—ఇండియాలోని ఫ్రెంచి స్థావరాలను నాలుగునెలల్లో ఖాళీచేసి వెళ్ళిపోతామని, ఇక్కడ ఉండిపోవాలనే ఉద్దేశం తమకు లేదని ఇండియాలోని ఫ్రెంచి రాయబారి కౌంట్ స్టానిస్లాల్ ఆస్ట్రోరాగ్ అన్నారు.

**ఆదివారం, జూన్ 20:**

—పుదుచ్చేరి స్థావరం సరిహద్దు పొడుగునా ఫ్రెంచివారు కందకాలు త్రవ్వుతుని మిలిటరీ సన్నాహాలు చేస్తున్నారు. ఫ్రెంచి ఇండియన్ పోలీసుస్టేషన్లు అన్నిట్లోను మరఫిరంగులు, వైర్లెస్ సెట్లు నెలకొల్పబడడమే కాక, సరిహద్దులో కొత్త పోలీసు స్టేషన్లు కూడా స్థాపించబడ్డాయి

—లావోస్, కాంబోడియాలలో యుద్ధ విరమణకు ఫ్రెంచి, వియట్మిన్ సైనికాధికారులు సంప్రదింపులు ప్రారంభించాలని ఉభయపక్షాలూ జెనీవాలో ఒప్పందం చేసుకున్నాయి.

—రష్యా విదేశాంగమంత్రి మొలటోవ్ జెనీవానుంచి మాస్కో వెళ్ళారు.

**సోమవారం జూన్ 21:**

నందికొండ ప్రాజెక్టు మొదటిఘట్టాన్ని మాత్రం రు. 12 కోట్లతో నిర్మించడానికి భారత ప్రభుత్వం సమ్మతిస్తుందిగాని పూర్తిగా నిర్మించాలని ఆంధ్రప్రభుత్వం పట్టుబట్టేపక్షంలో అసలు ప్రాజెక్టు నిర్మాణమే జరక్కపోవచ్చునని భారత ఆర్థిక మంత్రి దేశ్‌ముఖ్ గారు నెల్లూరులో హెచ్చరిక చేశారు

—కాశీనుంచి కన్యాకుమారి అగ్రానికి రహదారిలో కర్నూలుపట్టణంవద్ద తుంగభద్రపై వంతెన నిర్మించడానికి భారత ప్రభుత్వం నిర్ణయించినట్లు ఆంధ్ర హైవేస్ ఇంజనీర్ ప్రకటించారు గోదావరిపైన ఆలమూరువద్దకూడా రు 170 లక్షలఖర్చుతో వంతెన నిర్మించడానికి నిర్ణయమైందని వారు చెప్పారు. మొత్తం ఆంధ్రదేశంలో రోడ్ల అభివృద్ధికి రు. 187 లక్షలు కేంద్ర ప్రభుత్వం మంజూరుచేసింది

—వియత్నాములో ఎక్కడెక్కడ సైన్యాలను నిలువరించి యుద్ధం ఎలా విరమించాలో దాదాపు ఒప్పందం కుదిరినట్లే నని జెనీవా వార్త.

—ఫ్రాన్స్ కొత్త ప్రధాని మెండీ ఫ్రాన్స్‌తో బ్రిటిష్ విదేశాంగ మంత్రి ఈడెన్ పారిస్‌లో సంప్రదింపులు జరిపారు

—వియత్నాముకు పూర్తి స్వాతంత్ర్యం ఇవ్వవలసిందిగా బావోదాయ్ ఫ్రెంచి ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు

—గ్వాటిమాలాపై తిరుగుబాటుదారుల దాడిమూలంగా దేశంలో సైనిక శాసనం ప్రకటించబడింది.

—గ్వాటిమాలా ఫిర్యాదుపై భద్రతామండలి సమావేశమై యుద్ధం విరమించబడాలనీ, ఐక్యరాజ్య సమితి సభ్యులెవరూ ఈ యుద్ధంలో జోక్యం చేసుకోరాదనీ ఆదేశమిస్తూ ఏకగ్రీవంగా తీర్మానం చేసింది. ఈ సమస్యను అమెరికన్ రాజ్యకూటమికి ఒప్పగించాలని బ్రెజిల్, కొలంబియాలు ప్రతిపాదించిన తీర్మానాన్ని రష్యా వీటో చేసింది.

—చీనా ప్రధాని చౌ ఎన్‌లే పండిట్

(53–వ పేజీచూడండి)

## ★ అక్షరతూణీరం ★

(హైదరాబాద్‌లో సమావేశమైన విశాలాంధ్ర సదస్సువారు హైదరాబాద్ రాజధానిగా విశాలాంధ్ర రాష్ట్రం ఏర్పడాలని తీర్మానించారు)

రెండు కత్తు లొక ఒరలో
ఇముడవనే దెంత నిజము
ఒకే కత్తి రెండు ఒరల
ఇముడదనే దంతే నిజము.
బహు భాషల కొక రాష్ట్రము
ఉండుట తగనట్లే
ఒక భాషకు బహురాష్ట్రము
లుండుట తగదట్లే.
విశాలాంధ్ర వలయుననిరి
కొంతమంది సదస్యులు,
రెండు తెలుగురాష్ట్రాలను
కోరెడువారు దస్యులు.
నిశాచరులకోసం రవి
ఉదయించక దాగునా?
కొంతమంది కయిష్టమని
చరిత్రగతి ఆగునా?

—సవ్యసాచి.

# కాలక్షేపం

తను కార్యంబు పరిత్యజించియు
  పరార్థ ప్రాపకుల్ సజ్జనుల్;
తను కార్యంబు ఘటించుచున్
  పరహితార్థ వ్యాపృతుల్ మధ్యముల్;
తను కై యన్యహితార్థ ఘాతుక జనుల్
  దైత్యుల్; వృథా స్వార్థ భం
గను గావించెడు వార లెవ్వరో
  ఎఱుంగన్ శక్యమే వారికిన్?

తా॥ తను కార్యముల విడిచి పరుల కార్యములను చేయువారు సత్పురుషులు. తను కార్యములను చేసికొనుచు పరుల కార్యములను చేయువారు మధ్యములు. తమ కార్యము నిమిత్తమై ఇతరుల కార్యములను చెడగొట్టువారు రాక్షసులు. తమకు ప్రయోజనము లేకపోయినను యితరుల సొత్తును నష్టపరచేవారు ఎటువంటివారో చెప్పుట కెవరికైన శక్యమే?

ఇతరులకు ఉపకారం చెయ్యడం అంటే ఇతరులను కొన్ని చిక్కులలో నుంచిగాని, హీనదశలో నుంచిగాని తప్పించి ఉద్ధరించడం అని అర్థం చెప్పవచ్చు. అటువంటి సహాయం వాగ్రూపంగా ఉండవచ్చు; లేదా క్రియారూపంగా ఉండవచ్చు. కాని ఇది అది కాకుండా, తన ఆత్మతేజస్సును యితరులపై ప్రసరింపచేయుట వల్లనే యితరులను అజ్ఞానంలోనుంచి జ్ఞానంలోనికి గురువైనటువంటివాడు శిష్యులను ఉద్ధరించవచ్చు. స్వామి వివేకానందులు పూర్వాశ్రమంలో నరేంద్ర దత్త అని పిలువబడుతూ ఉండేవారు. కాలేజీలో యం. ఏ. చదువుతున్నాడు. పాశ్చాత్య ఇంగ్లీషు చదువులో మునిగి తేలుతున్నాడు. పాశ్చాత్య విద్య అంటే మతమూ లేదు. ఏదైనా సరే, ప్రత్యక్షంగా కళ్ళకు కనిపించినదానినే నమ్మవలెను. పరోక్షమైనదంతా అనుమానించవలసిన విషయమే. అనగా వెంటనే నమ్మకుండా సాక్ష్యమైనంత వరకు అనుమానించి, ఏదైతే పోలీసులకు రిపోర్టు చేయవలసిందే. మన యొక్క సత్ప్రవర్తనకు మెచ్చి భగవంతుడైన శ్రీ మహావిష్ణువు మన వాకిట్లోకి మన యింటి గుమ్మంలోకి వచ్చి తలుపుకొట్టి, "నరేంద్రా! నీవు నాయందు భక్తి తత్పరుడవైనందుకు నేను నీకు ప్రత్యక్షుడుగా కనిపించి, దర్శనమిచ్చి, నిన్ను ధన్యుని చేయవలెనని సంకల్పించినాను. నీ దరఖాస్తు ఏమిటో తెలియజేస్తే వెంటనే మంజూరుచేసి వెళ్ళిపోతాను" అని శంఖ చక్ర గదాధరుడై వస్తాడనుకోండి. లేదా ఏ బీదబ్రాహ్మణుని రూపంలోనో, ఏ బైరాగి రూపంలోనో మన యింటికి వచ్చాడనుకోండి. వెంటనే అటువంటి ప్రత్యక్ష ప్రమాణమును గూర్చికూడా అనుమానిస్తాము. "ఏ దొంగవాడో మనయింటికి దొంగవేషం వేసికొని మోసం చేయడానికి వచ్చాడు. మొగవాళ్ళం యింట్లో ఉన్నాము గనుక సరిపోయింది. లేకపోతే, ఇంట్లో ఆడవాళ్ళముందర, మనం లేకుండా చూచి, యిచ్చకములాడి, అరచేతి వైకుంఠం చూపించి, అందినంతమట్టుకు చంకను పెట్టుకొని పోగలిగినవాడే. అందుకు సందేహము లేదు. దేవుడేమిటి? ఈ రూపములో ప్రత్యక్షం కావడమేమిటి? ఇదంతా పొట్ట

తాపి ధర్మారావు

కూటికోసం బజాకోర్ వేషం. ఇదివరకు వీడు ఎంతమంది యిండ్లలో చొరబడి, ఎన్ని వస్తువులు సంగ్రహించాడో. వీడు మన గుట్టు కనిపెట్టవలెనని వచ్చాడు గనుక, వీని గుట్టూ పుట్టూ పూర్వోత్తరాలూ మనము తేల్చుకోవాలి" అని ప్రక్కనున్న పోలీసు స్టేషనుకు టెలిఫోను చేసి, ఆ శ్రీమహావిష్ణువును (ఆకారంలో ఉన్న శ్రీమహావిష్ణువును) పోలీసులకు ఒప్పజెప్పి, "శ్రీకృష్ణ జన్మస్థానమునకు తీసికొనిపోతారు. వాళ్ళతో వెళ్ళు" అని సాగనంపుతాము. దీని అర్థం ఏమిటి అంటే, ప్రత్యక్ష ప్రమాణంకూడా నమ్మజాలని స్థితిలో ఉన్నప్పుడు "భగవంతుణ్ణి చూపించు" అని మనము సవాలు చేస్తే ఏ పరమహంసకూడా మనకు భగవంతుణ్ణి చూపించి మనలను తృప్తిపరచలేడు. మన నమ్మకం నాస్తిచేసి మనలను ఆస్తికులను చేయలేడు.

నరేంద్రదత్తుకు భగవంతుడంటే ఏమిటి? అనే జిజ్ఞాసయుంది. మనస్సులో మథనపడుతున్నాడు. రామకృష్ణ పరమహంసవద్దకు వెళ్ళి ఆయన దర్శనం చేశాడు. కాని, రామకృష్ణ పరమహంసకు భగవంతుడు కనిపించాడనే మాట దత్త నమ్మలేదు. రామకృష్ణ పరమహంసయొక్క మొదటిపేరు (అనగా తల్లిదండ్రులు పెట్టినపేరు) గదాధర భట్టర్. నరేంద్రదత్తుకు భగవంతుని మీమాంసకంటె గదాధర భట్టర్ విషయమైన మీమాంస హృదయాంతర్గతంగా బాధిస్తోంది. "ఈతని ఆత్మ ఉచ్ఛస్థితికి వచ్చిందా? నీచస్థితికి వచ్చిందా? దేవుణ్ణి చూశాడా? మనకు దేవుణ్ణి చూపెట్టగలడా?" అనే మీమాంసలో పడ్డాడు. ప్రహ్లాద చరిత్ర చదివినప్పుడు మనము హిరణ్యకశిపుని చర్యలు చూచి హిరణ్యకశిపుని ద్వేషిస్తాము. వాడు దానవాధముడు అని తూలనాడుతాము. కాని, మనలో ప్రతివాడూ ఒకవిధంగా హిరణ్యకశిపుడే – "దేవుడు అనేవాడు ఉన్నట్లయితే, మనకు కనిపించడెందుచేత? పోనీ కనిపించకపోతే కనిపించకపోయినాడు. మనము ప్రార్థించి భజనచేసి మననము చేసినతర్వాతకూడా మన కోరికలు యీడేర్చడెందుచేత? దేవుడనేవాడు ఎక్కడున్నాడండీ? దేవుడూ లేడు దయ్యమూ లేదు. సహస్రనామార్చనలు చేయించి నూళ్ళో అభిషేకాలు చేయించి నూటారు టెంకాయలు కొట్టించినప్పటికీ, సివిల్ కోర్టులో వ్యాజ్యం ఖర్చులతో సహా అగ్గిలోపోసిన ఆజ్యం అయింది. ఏడాది ఎదిగిన బిడ్డకు నూరేళ్లు నిండినట్లయింది.

ఈ సంసారంలో సుఖం అనేది ఒక్కనాటికైనా కనిపించకుండా ఉంది. [illegible] పడినట్లుగా పడరాని పాట్లుపడుతున్నాను. ఎన్ని దేవుళ్ళను మొక్కుకున్నప్పటికీ, ఒక్క దేవుడూ నాకు అక్కరకు రాలేదు. ఏ దేవుళ్ళూ మొక్కినవాళ్ళ చిక్కుదీర్చినట్టుగా కాలుమీదకాలు వేసికొని హాయిగా కాలక్షేపం చేస్తున్నారు. వాళ్ళూ, వాళ్ళ బిడ్డలూ పాపలూ కలిగినంతలో కలిమీ గంజీ కడుపునిండా త్రాగి కంటినిండా నిద్రపోతున్నారు. వాళ్ళకు లేని కష్టము నాకెందుకు? ఎవడు చేసికొన్న కర్మ వాడు అనుభవించక తప్పదు అని వాదించినట్లయితే, మన కాలకర్మచక్రం తిరుగుతూనే ఉంటుంది. కాలధర్మ చక్రం కూడా తిరుగుతూనే ఉంటుంది. ప్రపంచంలో ధర్మమూ అధర్మమూ సాగుతూనే ఉంటుంది. జీవరాసులన్నీ తమ కర్మవశమున ధర్మమో అధర్మమో అనుసరిస్తూ ఆచరిస్తూ యీ సంసారచక్రంలో పడి గానుగ ఎద్దులవలె తిరుగుతూ ఉంటాయి. ఇది ఎట్లా సాగితేనేమి? ఆ శ్రీమహావిష్ణువు

పోయిగా అల వైకుంఠపురంబులో మందార వనాంతరములోగాని, క్షీరసాగరంలో శేష శయనం మీద గాని, కాశీ క్షేత్రాగ్ని సాక్షిగా సౌధం మీద పరున్న వాడై, పాపుల గొడవగాని, పుణ్యాత్ముల గొడవగాని లేకుండా, టపాకు వెళ్ళవలసిన కాగితాలమీద సంతకాలు పెట్టవలసిన బాధ్యతకూడా లేకుండా, తన పేరు బాగా ప్రోగేటందుకు మాత్రం "జనగణమన అధినాయక" అని ప్రక్కను బ్యాండు వాయిస్తూఉంటే "సెబాస్!" అని, తేరా కౌరాఖిల్లీ అంటూ ఉంటాడా? అటువంటివాడు "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అని నోటీసుబోర్డుమీద కాగితం అంటించినట్లుగా, వాటంగా ఒక అభయ హస్తం చాటించడం ఎందుకు? "ఎవడికర్మ వాడే అనుభవిస్తాడు" అనే శిక్షను సర్వకాల సర్వావస్థలయందు వర్తిస్తూ ఉంటుందనే మొదల, భగవంతుడనేవానికి మనలను ఉద్ధరించవలసిన పనిలేదు. మనం కష్టపడి చదువుకుంటే పరీక్షలో మనమే ప్యాసవుతాము. భగవంతుడు మనలను ఉద్ధరించి ప్యాసుచేయించే దేముంది? పరీక్షలో అడుగబోయే ప్రశ్నలేవో, పరీక్షకు ముందుగా మనకు రవ్వంతయినా, చాటుగా తెలియజేస్తే నిజంగా భగవంతుడు మనకు సహాయం చేశాడనుకోవచ్చు. లేదా పరీక్ష అయిన తర్వాత మార్కులు వేసే ప్రొఫెసరుతో మాట్లాడి మనకు పదిమార్కులు ఎక్కువ వేయించి ప్యాసు చేయిస్తే నిజంగా భగవంతుడు మనకు సహాయంచేశాడనుకోవచ్చు. అదీలేదు. ఇదీలేదు. ఏదీలేదు. మనం కష్టపడి చదువుకోవాలి. శ్రద్ధగా పరీక్షహాలులో అడిగిన ప్రశ్నలకు ఆలోచించి జవాబులు వ్రాయాలి. మన శ్రమకూ, మన శ్రద్ధకూ తగిన మార్కులు మనకు రావాలి. భగవంతుడు చేసే సహాయం ఏమీలేదు. అటువంటి సందర్భంలో పరీక్షహాలులోకి వెళ్లేముందు రావిచెట్టుక్రింద ఆంజనేయస్వామికి కొబ్బరికాయకొట్టి నమస్కారం చేసి, ఆంజనేయులవారికి పూసిన ఎర్రని సిందూరం మన నొసటను పెట్టుకొని, "నిన్నెంచ నేనెంతవాడన్" అని దండకం చదవడం ఎందుకు? ఇదంతా దండుగపని" అని విరమించవచ్చు. టెంకాయకయ్యేడి వ్యయము లేకుండా ఆదాయం అవుతుంది. విద్యార్థి ఆ ముక్కంటి ఫలానికి మూడణాలు ఖర్చు చేయడంకంటె మూడుఅణాలకు మూడు ఎక్సర్సైజు పుస్తకాలు రూళ్లువేసినవి కొనుక్కోవచ్చు. నిజమే. ముమ్మాటికీ నిజమే.

కొబ్బరికాయ కొట్టితే ప్రయోజనం కన్పించనప్పుడు ఆకోతికి కొబ్బరికాయ సమర్పించడంకంటె, "ఎక్కడున్నావురా?" అని సవాలుచేసి పోట్లాడడం మంచిది. "ఎక్కడ చూచినా నీవే యందురుగాని ఎందూ దాగున్నావురా?" అని తర్జన భర్జన చెయ్యాలి. "ఏతావునారా నిలుకడ నీకు" అని చక్కని కల్యాణిరాగంలో త్యాగరాజులవారుకూడా సవాలుచేసి, ఆయన ఆత్మకల్యాణం ఆయన చూచుకొని నిర్యాణం పొందినాడు. త్రికరణశుద్ధిగా, గట్టి పట్టుదలతో "ఏడి చూపించు ఆ చక్రిన్ గిక్రిన్; ఇందు గలడందు లేడని అంటావుగదా, ఏడి యీ స్తంభంలో చూపించు" అని మహోగ్రంగా ఒక్క తన్ను ఆ ఉక్కు స్తంభాన్ని తన్నగలిగినవాడు హిరణ్యకశిపుడు. అటువంటి పట్టుదలతో హోరాహోరి పోరాడినట్లుగా వేటాడినట్లుగా, పరిశోధన చేయగలిగినవాడే ఆస్తికుడు. పక్కా పదహారణాల నిక్కచ్చి ఆస్తికుడు — "నా ప్రాణమైనా పోవాలి ఆ దేవుడైనా కన్పించాలి" అని అహోరాత్రాలు తన మనస్సులో మథనపడి పరిశోధనచేయడమే, అసలైన సత్యాన్వేషణ. అసలైన పరతత్వాన్వేషణ. అటువంటివాడే తరిస్తాడు. హిరణ్యకశిపుడు తరించాడు. ప్రహ్లాదుడు ఏముక్తి పొందినాడో హిరణ్యకశిపుడుకూడా ఆముక్తినే పొందెననుటలో పొల్లుమాట ఇల్ల.

రామకృష్ణ పరమహంసవద్దకు వెళ్ళిన నరేంద్రదత్తుకూడా, "భగవంతుడు ఉన్నట్లయితే వానిని మీరు స్వయంగా చూచినట్లయితే, నాకుకూడా చూపించండి — అప్పుడు మీమాటలు నమ్ముతాను" అని ఆ పరమహంసను పరీక్షచేయడానికి పూనుకున్నాడు. గదాధరభట్టర్జీ నిజంగా శంఖ చక్రగదాధరుణ్ని చూచినాడా? గదాధరుణ్ని గాంచని యీ గదాధరుడు నటి దగాపరు లేమో?" అని వితర్కించాడు. అసలే క్షత్రియుడు. జంకుగొంకు లేకుండా పరమహంసనుకూడా శంకించాడు. "బుజువు చూపించు" అన్నాడు. బోనులో నెక్కించి త్రాసులో తూచినట్లుగా క్రాసుపరీక్ష చేసి సాక్షిని అడిగినట్లుగా ప్రశ్నించాడు.

భగవంతుని విషయములో ప్రత్యక్ష ప్రమాణంగా చూపించుట కేమున్నది? భగవంతుడు సత్యస్వరూపుడు. లేదా అసత్య (మాయా) స్వరూపుడు — సర్వము తానైన వాడు అంటే ఏమిటి? భగవంతుడు ధర్మస్వరూపుడు. లేదా అధర్మస్వరూపుడు. అదీయిదీ కాదు. కంటికే అతీతుడు. నిర్గుణుడు. నిరాకారుడు. నిరంజనుడు నిర్వికారుడు. నిరుపమానుడు. "నీరా", "నీరా" తప్ప అతనివిషయంలో యింకేమీ చెప్పడానికి వీలులేనివాడు. అనగా రూపం, కోపం, గుణం ఏమీ లేనివాడు — ఏమీ లేనివాడు అంటే (*Have-not*) వట్టి నిరాధారుడు. ఉపాధి లేనివాడు. ఆస్తిలేనివాడు. కేవలం ఏమీలేనివాడు, "లేదులేదనేవాడు" నాస్తికుడు అని చెప్పక తప్పదు. భగవంతుడే నాస్తికుడైతే, ఆయన భక్తులు ఏంకావాలి? వాళ్లుకూడా నాస్తికులే కావాలి. అదే వేదాంతం. వెర్రిలోవెర్రి వెంగళప్ప వెర్రివేదాంతమే అనండి. అందుకనే "అన్నమైతే నేమిరా మరి సున్నమైతే నేమిరా? అందుకని యీ పాడుపొట్టకు అన్నమే వేతామురా" అని వెర్రివెంగళప్ప వలె పిచ్చివానివలె మంత్రి యుగంధరుడు ఢిల్లీనగర వీథులలో బోధించాడు తన తత్వం. ఇటువంటి అవాఙ్మానస అగమ్యగోచర విషయంలో రామకృష్ణ పరమహంస ఏవిధంగా నరేంద్రదత్తుని సమాధానం చెప్పగలడు? ఏవిధంగా నరేంద్రదత్తుయొక్క సంశయమును విచ్ఛేదం చేసినాడో వివరంగా విశదీక

## శ్లోకం పూర్తిపాఠం

గీతీ, శీఘ్రీ, శిరఃకంపీ, తథా లిఖిత పాఠకః
అనర్థజ్ఞోల్పకంఠశ్చ షడేతే పాఠకాధమాః.

దీర్ఘం తీస్తూ పాటపాడినట్లుగా చదువువాడునూ, వేగంగా చదువువాడునూ, తల ఆడిస్తూ చదువువాడునూ, వ్రాసినది చూచి చదువువాడునూ, అర్థము తెలియకుండా చదువువాడునూ, అల్పకంఠముతో చదువువాడునూ, యీ ఆరుగురున్నూ పాఠకాధములు.

ఇది వేదపాఠకులనుగురించి ప్రత్యేకముగా పాణినీయ శిక్షాగ్రంథములో (32 శ్లోకం) చెప్పబడినది.

(ఈ పూర్తిశ్లోకమును వ్రాసిపంపిన పండితులకు కృతజ్ఞులము.)

## చమత్కార శ్లోకము

**శ్లో. అంబలి ద్వేషిణం వందే ఊరుపిండీ కృతాసురం,**
**ఊరగాయ కృతత్రాసం పాలనేతి ప్రియంగవాం.**

అంబలి, ఊరుపిండి, ఊరగాయ, పాలు, నేయి అనుపదములు తెలుగు పదములు. కనుక శ్లోకమసమంజసముని తోచును.

సాధారణార్థము:—అంబలిని ద్వేషించువాడును, ఊరుపిండి చేయబడిన దైత్యులు గలవాడును, ఊరగాయకు భయపడువాడును, ఆవులపాలయందు నేతియందు యిష్టపడువాడును, అగువానికి నమస్కరించెదను.

విశేషార్థము:—బలిని ద్వేషించువాడు, అకారవాచ్యుడు, ఊరువుల చేత అసురులను (మధుకైటభులను) నలిపివేసినవాడు సర్పమునకు (కాళియునకు) భయముగొల్పినవాడు, 'పాలనే + అతిప్రియంగవాం' గోవులను పాలించుట యన మిక్కిలి ప్రీతిగలవాడును అగు విష్ణువునకు నమస్కరించెదను.

—చిలకూరి వీరరాఘవశర్మ, గుడ్లవల్లేరు.

## ★ కాలక్షేపం ★

రించలేము. కాని, సంశయ విచ్ఛేదం అయి వివేకానందుడుగా మారిపోయినాడు.

> మౌనవ్యాఖ్యా ప్రకటిత పర
>     బ్రహ్మ తత్వం యువానా
> వర్షిష్ఠాంతే వసదృషిగణై
>     రావృతం బ్రహ్మనిష్ఠైః
> ఆచార్యేంద్రం కరకలిత చి
>     న్ముద్ర మానందమూ ర్తిం
> స్వాత్మారామం ముదితవదనం
>     దక్షిణామూ ర్తి మీడే.

ఈ సంస్కృత శ్లోకానికి తెనుగు పద్యం ఏమిటంటే—

> మౌనుల్ వృద్ధులు శిష్యభూతులును
>     బ్రహ్మధ్యాన నిష్ఠాపరుల్
> ధ్యానింపంగను జిన్నవానిని
>     దనున్ దా బ్రహ్మతత్వమ్మనుజ్ఞా
> మౌనవ్యాఖ్యను దెల్పునట్టి
>     గురు నాత్మారాము జిన్ముద్రితున్
> ధ్యానింతున్ స్మితవక్త్ర హర్షయుతు
>     మేధా దక్షిణామూ ర్తినిన్.

తా॥ తాను చిన్నవాడై వృద్ధులును, బ్రహ్మనిష్ఠులును, అగు శిష్యభూతులైన ఋషుల సంఘముచేత పరివేష్టింపబడి, వారికి తనమౌనమువల్లనే పరబ్రహ్మతత్వము నుపదేశించుచున్నవాడును, దక్షిణహస్తమునందు తర్జన్య అంగుష్ఠముల (ఒకటో వేలు రెండో వేలును) చేర్చి యుండుటవల్ల చిన్ముద్రను ధరించినవాడును, ఆనందమూర్తియు, స్వాత్మానందము ననుభవించువాడును, ప్రసన్నమయిన ముఖము గలవాడును, ఆచార్యులలో శ్రేష్ఠుడును అగు దక్షిణామూర్తిని స్తోత్రము చేయుచున్నాను.

రామకృష్ణ పరమహంస బోధించిన పరమ రహస్యం ఏమిటో వర్ణించి చెప్పలేము. కాని నరేంద్రదత్త "హా! తెలిసెన్" అన్నాడు. నేనిక నరేంద్రదత్తను కాను, వివేకానందస్వామిని అన్నాడు.

నరేంద్రదత్తను ఉద్ధరించినవాడు పరమహంస ఆయనను ఉద్ధరించుటకు యీయన పడిన కష్టం ఏమిటో చెప్పడం మనకు కష్టం మంత్రం బోధించలేదు వాక్సహాయం చేయలేదు. క్రియారూపకమైన సహాయం చేయలేదు పరమహంస మౌనంగా కూర్చున్నాడు. ఆయన ఎదుట నరేంద్రుడు మౌనంగా కూర్చున్నాడు. అంతే – శిష్యునిలోని అజ్ఞానం మైనం కరిగినట్లుగా కరిగిపోయింది, ఆ మౌనంవల్లనే – పరమహంసల యొక్క మౌనంవల్లనే మన అజ్ఞానం మైనం కరిగినట్లుగా, వారి తేజస్సు అనే జ్ఞానాగ్ని గుండం ముందర కరిగిపోతుంది.

అయినా, నిర్గుణుడైన భగవంతుడు ప్రేమస్వరూపుడు అని నిర్వచించి నప్పటికీ, "ప్రేమ అంటే ఎట్లా ఉంటుందో చూపించు" అని ఎవరైనా మనలను సవాలు చేస్తే, ఏం చెయ్యగలం" "ప్రేమమయ మీ జగమూ" అనే కీర్తన పదిసార్లు పాడి వినిపిస్తే, అదే ఒక గ్రామాఫోను రికార్డుగా పెట్టి గ్రామాలన్నీ సంచారం చేసి ప్రచారం చేస్తే, అందువల్ల గ్రామాలన్నీ ప్రేమమయం అవుతాయా? పార్టీలు కలహాలు, కోర్టులు దావాలు లేకుండా ప్రతి గ్రామం గోమయ మయం అయినట్లుగా ప్రేమమయం అవుతుందా? అందువల్ల ఆ గ్రామఫోను రికార్డులు ఎక్కువగా అమ్మకం కావచ్చు. గ్రామఫోను కంపెనీవాళ్ళకు లాభం రావచ్చు. కాని, అటువంటి కీర్తనలు ఎంత చక్కని రాగంలో పాడినా, ప్రపంచం అనురాగమయం ప్రేమమయం అవుతుంది అనేమాట బూటకం. అటువంటి పాటలవల్ల ప్రేమ యింకా యింకా చవుకయై, ఎంత శోకంలో పాడినా చవుకయై విలువ తగ్గిపోతుంది. అటువంటి పాటలవల్ల ప్రేమను విలువ పాట పాడినట్లవుతుంది. ప్రేమ విలువ రూపాయి నుంచి పావలాకు తగ్గిపోతుంది. సినిమాలు వచ్చిన తర్వాత ప్రేమ అంటే రెండున్నర గంటల ప్రదర్శనంగా తయారైంది. ప్రపంచ అంతర్జాతీయ ఐక్యరాజ్యసమితి మాత్రము ప్రపంచ రాజ్యాలకు ఐకమత్యం అనురాగం వృద్ధికావాలనే ప్రచారం చాలా చేస్తోంది. ప్రపంచాన్ని ఉద్ధరించాలనే బుద్ధితో చేస్తోంది. "ప్రేమమయ మీ జగము – ప్రేమయే జీవనము" అని ప్రచారం చేస్తోంది. అమెరికావంటి రాజ్యం వెనుకబడిన రాజ్యాలను ఉద్ధరించాలని అపారమైన ధనసహాయం ఆయుధ సాధన సహాయం చేస్తోంది

తన మేలుకోసమే తన వ్యాపారలాభం కోసమే అమెరికా బహువిధాల ఆయుధాలు సప్లయి చేస్తోంది అని రాజకీయరహస్యజ్ఞులంటారు తమ కార్యంబు పరిత్యజించిన పరార్థప్రాపకులు కారు అని అమెరికావారిని అనుమానించేవాళ్లు ఉన్నారు. ఏ దేశంవద్దకైనా

(55- వ పేజీ చూడండి)

# హైగోల్

రాచకొండ విశ్వనాథశాస్త్రి

హాలీవుడ్ యాక్టర్లా నవ్వేడు రామారావు, పరిచయులెవరో వస్తూంటే వాళ్లనిచూసి. వాళ్లు కూడా దూరంనుంచే పలకరించి నవ్వి, అలానే సాగిపోయేరు.

వాళ్ళవి హాలీవుడ్ యాక్టర్లనవ్వులు కావు రామారావుదే హాలీవుడ్ యాక్టర్ నవ్వు

సాయంకాలం ఆరుగంటలయింది. బీచి రోడ్డుని పేవ్‌మెంటుమీద, సింగారించుకొన్న ఆడవాళ్ళు వయ్యారంగా నడుస్తున్నారు. మగవాళ్ళుకూడా వాళ్ళల్లాగే సింగారించుకొని వాళ్ళల్లాగేనడుస్తున్నారు. పురపాలక సంఘంవారు తమకొక రేడియో సెట్టు ఉందని అందరికీ తెలియజేస్తున్నారు. వింటే సంగీతమని తెలుస్తుంది ఎవ్వరూ వినడం లేదు.

పేవ్‌మెంటుకిపక్కగా కారాపి అప్పుడే అందులోంచి దిగేడు రామారావు దిగి, తీవ్రంగా పైప్ కాలుస్తూ పేవ్‌మెంటుమీద కాస్సేపు నిల్చున్నాడు

రామారావూ, కాంతారావూ అయిదో క్లాసువరకూ కలిసి చదువుకున్నారు తరువాత విడిపోయేరు. రామారావు ఆనర్స్ పాసయేక ఉద్యోగం అన్వేషిస్తూ "ఇంటర్‌వ్యూ" కోసం మద్రాస్ వెళ్ళినప్పుడు, హొటేల్ గదిలోంచి పొద్దున్నే లేచి బైటకివస్తూంటే ఎదటగదిలోంచి ఒక కొత్తముఖం, కాని ఎక్కడో చూసిన ముఖం బైటకి వచ్చింది చూస్తే ఇంకెవరు? కాంతారావు కుశలప్రశ్నలూ వగైరాలన్నీ అయాక ఆరోజే అప్పుడేఅన్నాడు కాంతారావు, - "నవ్వినప్పుడు నువ్వు హాలీవుడ్ యాక్టర్లా ఉంటావోయ్" అని.

ఆహాలీవుడ్ యాక్టర్ పేరుకూడా చెప్పేడు కాంతారావు.

అయితే, మళ్ళీ గిజామన్నా జ్ఞప్తికి రాలేదా పేరు రామారావుకి.

అది అతనికి చాలా *Exasperating* గా ఉంటూ ఉంటుంది హాలీవుడ్ యాక్టర్ల పేర్లన్నీ జాబితా వేసి చూసినా, ఏ పేరు కా పేరే కాంతారావు చెప్పినదాన్లా అనిపిస్తుంది కాని, ఏ పేరు కాపేరే "ఊహుఁ, ఇది కాద"నిపిస్తుంది

పోనీ, కాంతారావునే కనుక్కుందా మంటే—

లేచిన వేళావిశేషం వల్లనో, లేక, లేక గానే రామారావు ముఖం చూసిన దోషం వల్లనో ఆరోజు మధ్యాహ్నమే హొటేల్ మేడ మెట్లమీద కాలుజారింది కాంతారావుకి. మీదమెట్టునుండి కిందమెట్టుకి వచ్చేలోపల ఎముకలు విరిగేయి, తల పగిలింది, స్పృహతప్పింది, మరో ఘడియకి ప్రాణం పోయింది.

ఎవరైనా చనిపోయారూ అంటే రామారావు విచారించడు. తండ్రి పోయినప్పుడు అతనికి ఏడుపు రాలేదు. ఆస్తి వచ్చింది. తల్లిపోయినప్పుడు అతనికి ఆస్తి రాలేదు. కొంచెం కన్నీరు వచ్చింది. ఆ తల్లి తన బంగారం అంతా కూడా "ఖూ ఖు ఖుండ"కే ఇచ్చేసినందుకు ఏడుపుకూడా వచ్చింది. అటువంటి మనిషి కాంతారావు చావుకి ఎందుకు విచారిస్తాడు? విచారించలేదు.

కాంతారావు లేనందుకు విచారిస్తూ ఉంటాడు రామారావు.

కాంతారావే ఉన్నట్లయితే ఆ హాలీవుడ్ యాక్టర్ పేరేదో యీపాటికి తెలిసిపోయుండును

కాని, విచారించి ప్రయోజనంలేదు.

చచ్చి స్వర్గాన ఉన్నవాళ్లు తిరిగి కిందకి దిగిరారు.

అలా తిరిగి కిందకి దిగిరాకపోడం ఉందే అదీ రామారావు మంచికే!

ఒక్క కాంతారావు తప్ప. చచ్చి స్వర్గాన్న ఉన్నవారెవ్వరూ కూడా దిగిరావడం ఇష్టంవుండదు రామారావుకి

అందులోనూ ముఖ్యంగా కొంతమంది



ఆవెంటనే రెండో పెళ్ళి చేసుకున్నాడు రామారావు.

రామారావుకి ఇప్పుడు ముగ్గురు కొడుకు లున్నారన్న సంగతి కొంతమందికి తెలుసు. అతని కిప్పుడు దాదాపు నాలుగు లక్షల ర కిమ్మత్తుచేసే స్థిరాస్తి ఉందని చాలామందికి తెలుసు. అంతకి డబుల్‌గా అతని దగ్గిర క్యాష్ ఉందన్న భోగట్టా ఇన్‌కంట్యాక్సు వారికి తెలీదు.

ఆయా సంగతులు నిద్రలోకూడా మర్చిపోడు రామారావు.

ఒక్కసారి చూస్తే చాలు, మరపుకిరాని విగ్రహం రామారావుది.

మంచి పొడవు, పొడవుకి తగిన లావు, పొడవుకీ లావుకీ తగినట్టుగా, పెద్దదీ కాకుండా చిన్నదీ కాకుండా ఉంటే సరైన బొజ్జ, ముఖంలో చిన్న చిరునవ్వు. అంతలోనే గాంభీర్యం. అంతలోనే బ్రాడ్ హాలీవుడ్ యాక్టర్ స్టైల్, పెద్ద మనిషని సూచించేట్టుగా తగుమాత్రం బట్టతల. "ముసలాడు కాడుస్మండీ" అన్నట్టుగా, గాలికి కొంచెం ఎగిరేట్టుగా పల్చటి జుట్టు.

నిండైన విగ్రహం. ఖరీదైన మనిషి.

పంచె, జుబ్బా, వాణీ వేసుకొంటే ఆ మూడూ ఖరీదైనవే. సూటు వేసుకొంటే అదీ ఖరీదైనదే. కళ్ళకి కూలింగ్ గ్లాసెస్, వేళ్ళకి ఉంగరాలు, రిస్టుకివాచీ; అవి ఖరీదైనవి కాకుండాపోవు, మోటారు కారు ఉంది అంటే అది ఖరీదైనది కాదని ఎవడన గలడు?!

షేవ్ టెంటుమీద కొంచెంసేపే నిల్చున్నాడు రామారావు.

కట్టుకున్న కాస్లీపంచె సముద్రపుగాలికి తెల్లమబ్బులా మెల్లిగా కదుల్తోంది. పట్టు జుబ్బా గుండెలకీ బొజ్జకీ మెత్తగా హత్తుకొంటోంది

నోట్లో ఉన్న పైపుని కుడిచేత్తో బైటకి తీసి పొగవదిలేడు రామారావు.

రామారావు నోట్లో చిక్కుకొని కూడా బైటికి తప్పించుకో గలిగినందు కొక్కరోలు నీలి పొగ ఆశ్చర్యపోయి ఎటుపోవాలో ఎరక్క గాభరాగా అటూ ఇటూ పరిగెట్టింది.

పరిగెట్టాల్సిన అవసరం రామారావుకి ఇంతవరకూ ఎన్నడూ కలగలేదు. అతను తాజాగా నడుస్తాడు. అతన్ది అరిస్టాక్రటిక్ గెయిట్.



# సైగల్



ఆరిస్టాక్రటిక్ గెయిట్‌తోటే ఇసకలోకి దిగబోయేడు. దిగబోతూండగా ఇంతలో ఎవరో పక్కనుంచి వచ్చి అతనికి కొంచెం పక్కగా కొంచెం ఎదురుగా నిల్చున్నాడు. పక్కనుండి వచ్చిన ఆసామీ మనిషిలా లేడు. నీడలా ఉన్నాడు. "నీడీ"గా ఉన్నాడు

బికారి, బైరాగి, బెగర్.

కొట్టడానికి కొచ్చేడా?

రామారావు జంకేడు.

"రామారావుగారూ! క్షమించాలి. కిందటిసారి తమర్ని కలుసుకున్నప్పుడు మొహమాటపడి అడగలేకపోయేను. చాలా జరుగుడుగా ఉంది. ఒక్క పాతిక రూపాయలు, దయచేసి..ధర్మంకింద అనుకోండి.. తమరి కాఫీ ఖర్చుపాటి ఉండదు."

కొట్టడానికి రాలేదని తెలుసుకున్నాక ఒక "విదరింగ్ లుక్" ఇచ్చేడు రామారావు.

"ఈసారిలా అడిగేవు. సరిపోయింది. మళ్ళీ నీ మొహం నాకు చూపించకూడదు తెలిసిందా! దమ్మిడీ అయినా సరే ఇవ్వను గాక ఇవ్వను. దయచేసి వెళ్ళు"

అని చెప్పేసి ఇసకలోకి చరచరా పాములా సాగిపోయేడు రామారావు.

బెగర్స్ బెగర్స్! అడుగుతీసి అడుగు వేస్తే ఏ బెగ్గరో ఓ బెగ్గరెదురు!

అయితే—

పాతిక రూపాయిలు 'బెగ్' చేసినవాడు మొదట్లో బెగ్గరు కాడు, ఇప్పుడైతే అనామకుడయేడు అప్పుడతను వెంకట్రావు, రామారావుకి అతను బాగా పరిచయుడు. అతణ్ని నోరుజార్చి ఎవరైనా డబ్బడగడం భయం...

అలా ఖర్చు చేసేసేడు.

ప్రస్తుతం ఇలా ముష్టెత్తుతూ తిరుపీధులూ తిరుగుతున్నాడు. వెంకట్రావుని చూస్తే రామారావుకి అప్పట్లోకూడా ఇష్టం ఉండేది కాదు.

ఒళ్ళెరక్కుండా ఎవడు ఖర్చుపెట్టమన్నాడలాగ?

గొప్పకి!

"ఫలానా వెంకట్రావు చేతికి ఎముక లేదు"

అనే గొప్పకోసం కాకపోతే మరెందుకలా కాల్చేస్తాడు డబ్బంతా?

ఇప్పుడు తెలిసొచ్చింది.

గొప్పంతా గోరుక్కుపోయింది.

అనుభవించమనండి.

చేతికి ఎముక లేదట ఎముక!

అందుకే చిప్ప చేతికొచ్చింది.

నవ్వొచ్చింది రామారావుకి.

ఇద్దరేసి చొప్పున ముగ్గురేసి చొప్పున జనం బీచిని కూర్చున్నారు, ఒంటిగా ఒకచోట కూర్చున్నాడు రామారావు.

"ఇంకా నవ్వొస్తూనే ఉంది రామారావుకి.

"రామారావుగారూ! క్షమించాలి, కిందటిసారి తమర్ని కలుసుకున్నప్పుడు మొహమాటపడి అడగలేకపోయేను"

గారు! తమరు!

"కిందటి సారి" అంటే నెలదినాల్రితం వచ్చేడు వెంకట్రావు.

అప్పుడు—

"ఏమోయ్ రామారావ్! కులాసా కదా? పిల్లాజల్లా బావున్నారా?

ఏం చేస్తున్నట్టిప్పుడు?"

అలా వెళ్ళింది ధోరణి.

చనవు! రామారావుదగ్గర చనవుతీసుకోబోయేడు.

దిబగర్ హేజ్ డిట్ ఛీక్!

చనవు తీసుకొని పర్సు తెరిపిద్దామనుకున్నాడు, "గట్స్" చాలక జారిపోయేడు.

ఇప్పుడు?

రామారావుగారూ! తమరు!

అందితే సిగ. అందకపోతే కాళ్లు.

పోనీ, ఈసారైనా తన తాహతేమిటో తెలుసుకొని మాట్లాడేడు.

తెలుసుకోకపోతే తెలియ చెప్పగలడు రామారావు—ఎవడికైనా సరే.

తనలోతను నవ్వుకొంటూనే, చలవ కళ్ళజోడు ఎడంచేత్తో తీసి నాలుగు వైపులా ఒక్కసారి దృష్టి పోనిచ్చేడు రామారావు.

మిస్టర్ సాహూ వస్తానన్నాడు. ఇంకా రాలేదు. ఇంకా రాలేదా? వచ్చినా కనిపించలేదా? ఎవడో యంగ్ మాన్‌తో మిసెస్ సన్యాల్ ఒడ్డువైపుకి నడుస్తోంది. ఎవడు వాడు? మరోకడా? అక్కడంత లావుగా కూర్చొన్నది పార్థసారథి కాబోలు వాడు తప్ప అంత దుక్కలా మరెవరుండగలరు! మిస్టర్ హాచిన్‌సన్ పిల్లలు కాబోలు, ముగ్గురు, బకెట్లలో తడి ఇసక పట్టుకొచ్చి కుప్పపోస్తున్నారు. వాళ్ళదగ్గర పక్కని పట్టుకొని నిల్చున్నావిడ మిసెస్ హాచిన్‌సనా? మిస్ రాబిన్‌సనా?

దృష్టి సరిగా ఆనడంలేదే!

రామారావు ముఖంలో నవ్వు మాయమయింది.

ముసలాణ్ణయిపోతున్నానా?

అనే భయం కలిగింది రామారావుకి.

సూర్యుడు అస్తమించేడు. చంద్రుడు ఉదయించే ఉన్నాడు. ఎక్కణ్ణించో వచ్చే గాలి రివట కెరటాల్ని తాకుతూ ఎక్కడికో పోతోంది. గుంపులోంచి తప్పిపోయి వెనక్కి మిగిలిపోయిన జాలరిపడవ కెరటాల్ని ఎక్కుతూ దిగుతూ తొందరగా ముందుకి రాబోతోంది. లైట్‌హౌస్ మీది దీపం కన్ను తెరుస్తోంది; మూస్తోంది; మూస్తోంది; తెరుస్తోంది.

బీచి అంతాకూడా చల్లగా రంగురంగుగా ఉంది. సముద్రపుఘోష అణగినప్పటికీ గంభీరంగా ఉంది. ఆ ఘోషముందు మనుష్యుల గొడవ చప్పగా చల్లారిపోతోంది.

ఈమధ్య ఒకొక్కసారి, ముఖ్యంగా ఒంటరిగా ఉన్న సమయాల్లో రామారావుకి ఈ భయం కలుగుతోంది. గుండెలమీద పాములాగ మనసులో బరువుగా కదుల్తోంది.

యాభయ్యయిదేళ్ళే కదూ వెళ్ళేయి.

మరో ముప్ఫయ్యేళ్ళైనా బతకడా రామారావు?

బతకొచ్చు, ఎందుకు బతకడూ!!

కాని—

ముందుకి కాలం ఇలానే వెళ్తుందా?

సరిగా ఇటువంటి సమయంలోనే ఆ ముసల్దాని మాటలు చెవుల్లో గింగురుమంటాయి.

ఒకనాటి మిట్టమధ్యాహ్నం, ఊరంతా నిప్పులు చెరుగుతూండగా, ఈ చెవిలోంచి గాడ్పు ఆ చెవిలోకి కొడ్తూండగా, రామారావింటి ముందు నిల్చొని, చేతులుజాచి, మూతిడొత్తు ఎగురుతూ, నిప్పులో కక్కిన కోతిలా గెంతుతూ, మంటే రాకుసిబొగ్గులా మండిపడిపోతూ ఓ "ముసలిముండ" రామారావుని తిట్టిన తిట్లు, రామారావు మర్చిపోదామని విశ్వప్రయత్నం చేసినా మర్చిపోలేకుండా ఉన్నాడు

"నువ్వు దానికేదో అపచారం చేసి ఉంటావు. లేకపోతే నిన్నెందుకలా తిడుతుందది?"

అంటే ఆ మాటకి రామారావొప్పుకోడు.

ఆ ముసల్దాని కొడుకు రామారావుని దగా చెయ్యబోయేడు. వాడి డబ్బు కొంత రామారావు దగ్గిర ఉంది. ఆ డబ్బుని మట్టిపెట్టి ఉంచేడు రామారావు. ఇంతలో వాడు చచ్చిపోయేడు. ఆ డబ్బు ఇచ్చేయమంటుంది ముసిలి. ఎందుకివ్వాలి? రామారావుని ఆ వెధవ దగా చెయ్యబోయి ఫెయిలయేడే అనుకోండి. కాని, దగా చెయ్యబోయేడా లేదా? అటువంటి వెధవల డబ్బు చేజిక్కిం తరవాత ఎందుకు విడిచిపెట్టాలి?

అందుచేత "లేదు పో"మన్నాడు రామారావు

ముసిల్ది తారాజువ్వలా లేచింది. తెయ్యిమని గెంతింది.

కాని, ఆ డబ్బు రామారావుదగ్గిరున్నట్టు సాక్ష్యం ఏదీ లేదు.

ఇహ, చేసేదేమీ లేక, కడుపుమంట పట్టలేక, తిట్లు తిట్టిపోయింది ముసల్ది.

ఆ వ్యవహారంలో తన నడత "మోరలీ జస్టిఫయబుల్" కాదని రామారావెన్నడూ అనుకోలేదు. అతని కావిషయంలో క్వొశ్చన్ ఆఫ్ కాన్షన్స్ లేవు

కాని—

"ముసలిముండ" తిట్టినతిట్లు;

"నీఇంటా శ్లీనుగగ్గా. నీమీద అగ్గిపిడుగు పడిపోనూ. నీ వనకాముండూ రాలిపోనూ. నీవంశం నిర్వంశం అయిపోనూ. నువ్వు సర్వనాశనం అయిపోనూ..."

ఈతిట్లు రామారావుని బాధించవు.

కాని, ఇటీవల ఆముసల్ది తిట్టిన ఆఖరి తిట్టు, లాల్చీలో పూలిక ఉండీ ఉండీ గుచ్చుకొన్నట్టుగా, మనసుని గుచ్చుకుంటూ వస్తోంది.

"కాలం మళ్లదూ? నాకు మళ్ళినట్టే నీకూ మళ్ళుతుంది. అప్పుడ్నీకు పెద్దరోగం రాకపోతే చూసుకోదా కసాయి వెధవా! పచ్చి మంచినీళ్లయినా గొంతుకలో పోసే వాళ్ళేక, ఈగలైనా వాలక, కుళ్ళికుళ్ళి చస్తావురా, చచ్చిపాడా, నువ్వూ! అప్పటిక్కాని తెలిసిరావురా నీ పాపాలన్నీ నీకూ"

అంటూ శాపం పెట్టినట్టుగా కేకలేసి తిట్టింది "ముసలిముండ"

సాఖర్ల చేత జుట్టు పట్టించి ఈడ్పించేసే పారోజు దాన్ని.

పిచ్చిముండ!

దాన్నంతకంటె ఏంచెయ్యడం?!

ఈపాటికి చచ్చేఉంటుంది.

కాని, ఆమెమాటలు రామారావు చెవుల్లో బతికే ఉన్నాయి.

గుండెలమీది సర్పం మరోసారి కదిలింది.

"నిజంగా నేను పాపాల్చేసేనా?"

అనుకున్నాడు రామారావు

సరిగ్గా అప్పుడే ఆగింది [illegible] గంధర్వ ఘోషం.

మరొక స్టేషన్.

మరొక కంఠం.

మరొక పాట.

కుందనలాల్ సైగల్!!

గాలి పదంతప్పక నడుస్తోంది. కెరటాలు లయతప్పక విరుగుతున్నాయి. వెన్నెల కరిగి కరిగి జారుతోంది.

కూర్చొన్న రామారావు కదల్లేం మర్చిపోయేడు.

ఓహో! ఏమిటీపాట!

ఈ పాటలో—

వెన్నెల వెలుగులున్నాయా? చుక్కల తళుకులున్నాయా? చిక్కటి చీకట్లనునుపులున్నాయా? కెరటాల విరుపులున్నాయా? ఇంద్రధనుస్సుల రంగులున్నాయా? వేడి కొండల నిట్టూర్పులున్నాయా? జలదాల జలదరింపులున్నాయా?

ఈ పాటలో—

ప్రియురాలి విరహముందా? పడుచు రక్తపు ప్రవాహముందా? స్మృతులే మిగిలిన ముసలివాని బోసినవ్వుందా? పసిపాపల హాసముందా? కూలివాని కష్టముందా? పేదవాని ఏడుపుందా? సీతాదేవి శోకముందా? రాధేయుని హృదయముందా? అసహాయుని ఆర్తనాదముందా?

ఈ పాటలో ఏవేవో ఉన్నాయి

ఈ పాటలో ఎన్నెన్నో ఉన్నాయి.

కాని—

ఈ పాటలో పాపాల్లేవు.

ఈ పాట పాపాన్నెరగదు.

పాపాన్నెరగని ఆ పాట వినిపించగానే రామారావు గుండెల మీది సర్పం కదలింది. తలఎత్తింది. పడగవిప్పింది.

"నిజంగా నేను పాపాల్చేసేనా?"

అని ప్రశ్నించుకొని తనకే సమాధానం చెప్పుకోనక్కర్లేదు.

చేసిన పాపాలు కనిపిస్తూనే ఉన్నాయి.

చనిపోయాయనుకున్న స్మృతులు బ్రతికొస్తూనే ఉన్నాయి. తనుకూల్చిన కొంపలు; తనుమాపిన సంసారాలు; తన దెబ్బతిన్న వాళ్ళ ఏడుపులు; తనని బ్రతిమిలాడి, ప్రాధేయబడి, కాళ్ళుపట్టుకొని, చివరికి చేతులు ముడుపుకుపోయిన వాళ్ళ విషణ్ణ వదనాలు; ఆత్మహత్యలు; హాహాకారాలు; కారిన కన్నీటి కాలువలు; రాలిన రక్తపు చుక్కలు; చావులు; మంటలు; ఘోరాలు, ద్రోహాలు. పాపాలు; ఎన్నెన్నో దృశ్యాలు, ఎన్నెన్నో స్మృతులు, వరసగా, ఒక్కొక్కటిగా కనిపించి, లేచి నిల్చొని ముందుకొచ్చి "వీడు నీచాతినీచుడు; నరరూపరాక్షసుడు, అధమాధముడు; అతి దుర్మార్గుడు; మహాపాతకుడు" అని చేజాచి చూపించి గొంతెత్తి చాటించి చెప్పిపోతున్నాయి.

కళ్లు మండుతున్నాయి.

గుండెలు మండుతున్నాయి.

ఒళ్లంతా మండుతోంది.

కడుపులో కల్లోలం.

హృదయంలో సంక్షోభం.

మనసులో భీకర ప్రళయం.

పాట ఎప్పుడు ఆగిందో గుర్తులేదు రామారావుకి.

ఎప్పుడో కాని లేచి నిల్చున్నాడు.

రాత్రయింది. జనసంఖ్య పల్చబడింది.

నిల్చొన్న రామారావు, దూరంనుంచి చూస్తే కడిగేసిన శిలలా ఉన్నాడు. దగ్గర్నుంచి చూస్తే మనిషంతా నీరయినట్టుగా ఉన్నాడు.

ఒళ్ళంతా చెమటపట్టేనమీదట, అప్పుడే గాలి ఒక్క విసురు విసిరిందేమో, అతనికి చల్లగా ప్రాణం లేచి వచ్చినట్లయింది.

ఒక్కసారంటే ఒక్కసారే గంగలో స్నానంచేసేడు రామారావు.

అది కాశీ, చలికాలం మళ్ళింది. కాని ఇంకా చలిచలిగానే ఉంది.

తెల్లవారింది. గంగానది నిర్మలంగానే ప్రవహిస్తోంది. గంటలు ఎన్నో చోట్ల మ్రోగుతున్నాయి. ఎక్కడెక్కడ్నించో వచ్చిన వాళ్లంతా దేవుణ్ని స్మరిస్తున్నారు. నీట్లో మునకలు వేస్తున్నారు. నీట్లోంచి పైకిలేచిన మెట్లన్నీ తడిసి నీరెండకి మెరుస్తున్నాయి. తడిబట్టలూ, తడిజుట్లూ దులిపినప్పుడు నీటిజల్లులో పంచరంగులు విరుగుతున్నాయి నదిలో స్నానంచేసి బైటికివచ్చి మెట్టుమీద నిల్చున్నాడు రామారావు.

అతని కా సమయంలో తనెంతో పవిత్రంగా ఉన్నట్టు భావన కలిగింది.

అతని కప్పుడు మనుష్యులందరియెడలా సోదరభావం కలిగింది. అతనప్పుడు భగవంతుని తల్చుకొని మిక్కిలి వినమ్రుడయేడు. అతని మనసంతా ఎంతో నిర్మలమయింది. ప్రశాంతత పొందింది.

కొద్దిసేపే కావచ్చు.

ఆ క్షణాన్న ఉజ్జ్వలంగా లేచే సూర్యుణ్ని కూడా కంటితో చూడగలిగేడు.

పాట విని లేచి నిల్చున్న రామారావుకి తిరిగి అదేవిధమైన అనుభూతి కలిగింది.

స్నానంచేసి కలుషాన్నంతా కడిగేసుకున్నట్టుగా అతని మనసంతా పరిశుభ్ర పడింది. చల్లనయింది.

పైన, చంద్రుడు బంగారు దీపంలా వెలుగుతున్నాడు. చుక్కలు వజ్రాల రవ్వల్లా మెరుస్తున్నాయి. సముద్రం భక్తుల గుండెల్లా ఉప్పొంగుతోంది. తల్లి చెయ్యిలా గాలి చల్లగా అందర్నీ తాకుతోంది.

"ముందు, వెంకట్రావు విషయం [illegible] చూడాలి"

అనుకొంటూ తలవంచుకొని నెమ్మదిగా నడిచేడు రామారావు. ★




సీరియల్

శారద

# 30

పద్మ కనపడక ఇప్పటికి రెండు నెలలపైన అయిపోయింది. భాస్కర్రావు కాయకష్టంలా వెతికాడు బెజవాడంతా. ఆమె పుట్టింటికి వుత్తరం రాసి కనుక్కున్నాడు; అక్కణ్ణించి "రాలేదు" అని జవాబు వచ్చింది. ఇక తిరగలేక విరక్తిపుట్టి వూరుకున్నాడతను. సహజంగానే అతన్ని దిగుళ్లు ఆవరించుకున్నాయి. సుందరంగారు భాస్కర్రావును ఓదార్చారు - ఆమె స్వభావం చంచలంకాబోలుఅనీ, అందుకనే ఎక్కడికో వెళ్ళిపోయిందనీ. అంతకన్న వాళ్లు వేరేకారణం వూహించలేకపోయారు. ఎట్లా వూహించగలరు? ఆమె శీలాన్ని శంకించటానికి భాస్కర్రావుకి ఆమెమీది గౌరవం అడ్డం వస్తోంది. అందువల్ల అతడు అటువంటి ఆలోచనే రానివ్వలేదు. కాని అతని మేనత్త వూరుకోలేదు. "నేనప్పుడే అనుకున్నారా నాయనా, అది కడుపుతో వున్నదిరా. మగబిడ్డవి నీకేం తెలుసురా. అందుకనే మొహం చెల్లక పారిపోయిందిరా" అంది బాధగానే. ఆమెలోనూ పద్మమీద జాలి, దయ లేకపోలేదు. కాని ఒకవంక అసహ్యం. దీన్ని భాస్కర్రావు భరించలేదు.

"ఎందుకత్తయ్యా అట్లా వూహిస్తావు? ఆమెకు అట్లాంటి అవకాశం ఎక్కడ వుంది? ఆమె ఎప్పుడైనా బయటకన్నా వెళ్లితే పోనీ అనుకోవచ్చు. పాపం వస్తుంది ఆమెకి దోషం అంటగడితే" అంటాడు.

"నేను అంటగడుతున్నానట్రా నాయనా! ఇరుగూ పొరుగూ అనుకుంటున్నారు. నా చెవినీ పడ్డది. అందుకని అన్నాను." అన్నది మేనత్త ఒకమెట్టు దిగి.

"పోనిమ్మా! ఇరుగూ పొరుగూవాళ్ళకి ఏమీ పనీ పాటలు లేవనుకుంటా. పిన్ని! ఆమె ఆచారం, ఆమెభక్తి! ఎంతో శాంతంగా, అణకువగా వుండేది! ఆమె నంటున్నారా, ఇటువంటి అపభ్రంశపు మాటలు! నాలిక పుళుగులు పడుతుంది" కోపం, శోకం పొంగివచ్చాయి భాస్కర్రావుకి.

"ఇంకోమాట అంటున్నారురా వాళ్ళనోటపడా!" అంది, ముసలమ్మ చెప్పడానికి జంకుతూ.

"అదేమిటి—!"

"'నేనే ఆమె బయటికి వెళ్ళటమెందుకు, ఇంట్లో ఈడయిన పడతికొడుకు వుంటూండేదే' అంటున్నారురా, పాడుగాలం వచ్చిన పీనుగలూ" అంది మేనత్త.

"రామ - రామ" అని చెవులు మూసుకున్నాడు భాస్కర్రావు జుగుప్సతో. "ఏంమాటలు అత్తయ్యా! నమ్మా పిన్నినీ ఎరగవా నువ్వు! నువ్వు ఈమాట నమ్మావా?" అన్నాడు అతని అభిమానం విపరీతంగా దెబ్బ తిన్నది.

"ఛీ. ఛీ. నేనంటున్నానట్రా ఆమాటలు! నేను నమ్మలేదు నాయనా! పాపం అది ఎక్కడికి పోయిందో, అని నేను దిగులు పడుతున్నానుగాని, ఈ వెధవమాటలేమీ చెవిని వేసుకోటంలేదు; కాని గుంయ్‌మని చుట్టూ అనుకుంటూంటే చెవినిపడక మానాయా మరి చెప్పు నాయనా!" అంది బాధగా.

"ఇంక చెప్పకు అత్తయ్యా, చాలుగాని, దరిద్రపుమాటలు" అనేసి, భాస్కర్రావు ఆసంభాషణకి స్వస్తిచెప్పి వూరుకున్నాడు అతనికళ్ళల్లో నీళ్లు తిరుక్కొన. చాలా బాధపడిపోతున్నాడు మానసికంగా. అయినా పిన్ని ఎక్కడికి పోయివుంటుంది? చెప్పకుండా ఎందుకు పారిపోవాలి? ఏంభయం? తనతోటి ఒక్కముక్క చెప్పితేం ఏం? అన్నీ ప్రశ్నలే. జవాబే కనపడదు అతను ఇక ఈ సంభాషణే మానేశాడు; పిన్నిగురించి మాట్లాడ్డమే బాధగావుం దతనికి. ఆమె ఎట్లా ఆయింటికి వచ్చిందో అకస్మాత్తుగా, తనకు తెలీకండా, - అంత అకస్మాత్తుగానూ, తనకు తెలియకుండానూ నిష్క్రమించిం దీరోజున తను దిగులుపడడం అనవసరం. ఎన్నిటికని దిగులుపడడం? ఇప్పుడు నెలనెలా ఎట్లాలేదన్నా 60 రూపాయలు వస్తున్నాయి. దిగులు లేకుండా తినగలుగుతున్నారు మేనత్తా తనూ. కాని, ఇంట్లో సరిగ్గా వండుకుతినటానికి, వాడుకోడానికి, ఇత్తడిబొచ్చెలంటూ లేవు; తను వుండడం గుడ్డలకొట్లోనే; కాని తనకి సరైన గుడ్డలు లేవు. ఆశ్చర్యం! పండించేవాడికి తిండి కరువు, నేసేవాడికి గుడ్డలకరువూ! అట్లాగే వుంది తన ఇబ్బందీనూ. ఎంత మొత్తుకున్నా తనఘోష ఎవరికీ వినపడదు. పిన్నిఘోష ఎవరికి వినిపించింది గనక! సామాన్లూ, గుడ్డలూ కొనుక్కోవాలి. ఇంకో దారిద్ర్యం వుంది, అతను సహించలేకుండా వున్నాడు. ఒక పేపరు చదవటానికో, ఒకపుస్తకం చదవటానికో తీరిక దొరకదు, ఎవరైనా తెచ్చిస్తున్నాగానీ. కొనటం అనేది కలలోనైనా తలపరానిమాట

వించేస్తాడు! కాని అతని ప్రవృత్తిలోని మెతకతనం, అతనికెప్పుడూ శాంతినే ఇస్తూవుంటుంది. ఆ స్వభావమే, అతని మొహంలో తేజస్సుకీ, మాసిపోని చిరునవ్వుకీ కారణం. అదే సుందరంగార్ని ఆకర్షించింది. సుందరంగారి చెవిని, భాస్కర్రావు—పద్మల సంబంధాన్ని గురించిన మాటలు కొన్ని పడ్డాయి. ఆయన దీర్ఘకాలపు అనుభవాన్ని పట్టి దాన్ని నమ్మలేకపోయినాడు. అది నిజమైతే, ఆమె అట్లా పారిపోవల్సిన అవసరమెందుకు కలుగుతుంది? ఈ మూడేళ్ల కాలంలోనూ లేని అవకాశం ఇప్పుడే వచ్చిందా, అతనికి! అతని మాటలు వింటూవుంటే అతనికి పద్మమీద ఎంత గౌరవం వున్నదీ, ఎటువంటి మాతృభావం వున్నదీ తనకి వ్యక్తమౌతూనే వున్నది. నమ్మశక్యంగాని మాట ఇది కాకపోయినా, ఆపది తల్చుకుంటే ఎంతమంది చుట్టూ కాపలావున్నా, తనపని తాను సాగించుకుపోగలుగుతుంది. ఆదిశేషువులాగా, వెయ్యితలలూ, రెండువేల నాలికలూ వున్నాయి సమాజానికి; బుర్రమాత్రం శూన్యం; ఏ యొక్క విషయాన్ని గురించీ, ఆలోచించటం అన్న ప్రమాదకరమైన పని పెట్టుకోకుండా, కష్టంలేకుండా అందుబాటులోవున్న కారణానికి ముడేసి, అతక్కపోయినా సరే, అదే పనిగా ప్రచారం చేస్తుంది, విషం కక్కుతూ.

ఇట్లా తర్కించుకుంటూ ఆయన మంచిచెడ్డలు జేరీజువేసి, భాస్కర్రావు నికరమైన వ్యక్తి అని తేల్చుకున్నాడు. నిష్కల్మషుడనీ, అమాయకుడనీ, గుర్తించాడాయన. అట్లా కాకపోతే ఇన్ని బాధలు రావు అతనికి అని గూడా వూహించాడు. ఆయన ఇంకోపని చేశాడు. ఇదేమీ పల్లెటూరుగాదు, ఒక అపవాదు సంవత్సరాలతరబడి ప్రచారంలో వుండిపోవడానికి. ఆ పేట వొదిలి ఇంకో పేటలోకి వచ్చేస్తే, ఈమాటలు అట్టే బాధించవు బస్తీలో ఒకమూల కొంపలు తగులడిపోతూంటే పొరుగు వీధివాళ్లే పట్టించుకోరు ఒక పేటలో దొంగ—ఇంకో పేటలో దొరలాగా జీవించవచ్చు పైగా, బస్తీ ప్రవహించే నదిలాంటిది; ఇవ్వాళ తీవ్రమైన ఆందోళన కలిగించే సంఘటన రేపటికి మామూలై ఎల్లుండికి మాసిపోతుంది. ఒకదాన్ని పల్లెలో తర్కించినంత తీరికగా, బస్తీలో కొసంటూ నిదానంగా తర్కించటానికి తీరికా, అవకాశం అరుదు. ఇక్కడ అన్నీ పరుగులమీద నేనాయె సాగడం జరవది, హోటల్లో కాఫీ తాగడానికి వెళ్లేవాడు, ఏదో కలకత్తా మెయిలుకి వెళ్లేవాడులాగో, లేక అవతల ఎవరికో ప్రాణాపాయం సంభవించి, వీడే సంరక్షించటానికి వెళ్తున్నట్టో గోచీ వూడిపోతున్నా మాసుకోకుండా పరిగెత్తాడు. నిదానంగా, చుట్ట కాల్చుకోటానికి లేకనే చిన్నబీడీలు గోగుపుల్లల్లా గుంటాయి, అవి, ఒక్క దమ్ములాగి అవతల పారేసి చక్కాపోతాడు. భోంచెయ్యడమూ అంతే; గబగబ నమిలీ నమలకుండా మింగి పరిగెత్తడం, అజీర్ణంతో డాక్టరింటికి వెళ్ళడమూ ఇంత తొందరగా, పోయి చేసే ఘనకార్యాలేవీ వుండవు; కాని ఏదో తొందర, ఆందోళన, ఆదుర్దా. ఇవ్వాళ కనపడ్డవాడు రేపు కనపడడు; బస్తీలో నిలకడ తక్కువ. వుండేవాళ్లు వుండరని కాదు. అలాంటి అస్థిరమైన బస్తీలో, కాపురం ఇంకోపేటలోకి మారిస్తే, భాస్కర్రావు మీది అన్యాయమైన అపవాదు మాసిపోవచ్చు; అతనూ దాన్ని మర్చిపోగలడు, అనుకున్నాడాయన. వెంటనే, తనఇంటి పరిసరంలో రెండు గదులుగల ఓ పెంకుటింటి భాగం అద్దెకు కుదిర్చాడు. తన వుద్దేశాన్ని వివరించాడు భాస్కర్రావుకి. భాస్కర్రావుకూడా అంగీకరించాడు. వారం తర్వాత అతను, సుందరంగారింటికి ఫర్లాంగు దూరంలోవున్న ఆ యింటిలో ప్రవేశించాడు. ఈ ఇంట్లో ఇంకో నాలుగు కాపరాలవారున్నారు. అయితే ఎవరికివారే యమునాతీరే అన్నట్టుంటారు; వుద్దేశ్యపూర్వకంగా అట్లా వున్నారని కాదు అర్థం. ఇంకొకరితో మాట్లాడ్డానికి తీరిక లేని జీవితం వాళ్లది; ఇళ్లల్లో ఆడవాళ్లేమైనా అప్పుడప్పుడు కలుసుకుని మాట్లాడుకుంటారేమో. పైగా, ఆ కాపరాలవారి. ఇళ్ళల్లో ప్రతి ఇంటిలోనూ, ప్రతిరోజూ, ఏదో ఒక అవసరమైన సామాను వుప్పో, కాఫీపొడో, పంచదారో, ఆముదమో, లోపించేది; దానికోసం, పొరుగు కాపరాలవార్ని అడగక తప్పదు; అది వొక గాఢమైన పరిచయం. అత్యవసర సంబంధం.

ఈ కాపరాలున్న ఇంటిముందు, రోజూ ఎవరో ఒకరు ఋణదాత తారస్థాయిలో పోట్లాడుతూ వేపుంజేవారు. పాలవాడో, పెరుగుమనిషో, చిల్లరకొట్టు షావుకారో, ఎవరో వొకరు. ఆ ఐదుకాపరాలవాళ్ళలో ఎవరితోనో వొకరితో, ఋణదాత యుద్ధం సాగుతునే వుండేది ప్రతిరోజూ. అదీ ముఖ్యతరగతి. వాళ్ళ సంపాదన నెల మొత్తంమీద వందకి మించదు. కుటుంబాలా పెద్దవి; ఆ సమష్టి ఇంట్లో, ఎక్కడచూసినా పిల్లలు అరుస్తూ ఏడుస్తూ తిరుగుతూ వుంటారు. ఇంటి అద్దె విషయంలో కూడా మొదటి తారీకు లగాయతు పదిహేనో తారీకుదాక, యింటి యజమాని పోరాడి గెల్చినట్టే అద్దె వసూలుచేసుకునేవాడు; పదిహేనో తారీకునించి, మళ్ళీ మొదటితారీకుదాకా, పాతబాకీకోసం యుద్ధం ప్రకటించి గడపమీంచి జలగలాగా వొదిలేవాడు కాదు. అందులోవున్న సంపాదించే వ్యక్తులు, వున్న వొకటిరెండు చొక్కాలు వుతికి, తెల్లగా చెంబు ఇస్త్రీ చేసి తొడుక్కొని, పరువుగా పనులకి వెళ్లేవారు. జీతాలందిన తొలిరోజుల్లో వాళ్ళ మొహాలెంత సంతోషంగా వుంటాయోగాని, నెల మొత్తంమీద, 25 రోజులవరకూ అమావాస్యలే ఆ మొహాలు దీనికితోడు ఎవరైనా చుట్టాలువచ్చారా, నెలగ్రాసం పదిహేనురోజుల్లోనే అయిపోయి, మిగతా పదిహేనురోజులూ, ఋణదాతలమీదే ఆధారపడేవారు వడ్డీలకి డబ్బు ఇచ్చే ప్రభువులు ఈ తరుణంలోనే కనిపెట్టి రూపాయకు బేడలు వడ్డీకొడికి, ముందే మినహాయించుకుని పెట్టుబడి పెట్టేవారు. మరుసటినెల మొదట్లో, ఈ అసలు, వడ్డీ కలిపి వసూలు చేసుకుంటారు ఆ ప్రభువులు. ఈ జీవులు తిరిగీ అప్పు తీసుకోక మళ్ళీ నెలగడిచే వుపాయం లేదు కనక వాళ్లెప్పుడూ అప్పులపాలై వుంటారు వాళ్ళ గడపలముందు, రోజుకో యుద్ధం తప్పనూ తప్పదు. వాళ్లు వడ్డీతోసహా తీర్చేస్తారు, కాని ఆలస్యం అవుతుంది అది ఋణదాతలకీ తెలుసు. అయితేనేం? వీళ్ళ ప్రాణం నిత్యం కొరకటం ఏ ఋణదాతా మానడు

వీధిలోనుంచి ఆ యింటిలోకి వెళ్ళటానికి పదిగజాల పొడుగు ఇరుకుచీకటి సందులోనుండా వెళ్ళాలి. రెండువేపులా రెండిళ్లుండటంవల్ల, ఆ చూర్లు సందు కిరువేపులా కప్పునని ఆ సందులోకి వెలుగు రానేరాదు వొచ్చే వెల్తురు అతి స్వల్పం. అదైనా పగలు కాసేపే. ఆలోపల వున్నది ఈ ఐదుకాపరాలున్న సుమారు మొత్తంమీద పెద్దఇల్లే పది చిన్నచిన్న గదులు, మధ్య ఓ హాలు. అది అందరికీ ఉమ్మడి. ఆ గుమ్మలు ఏనాడు కడిగారోగాని, గోడలన్నీ పొగమారి నల్లగా, పసుప్పచ్చగా వున్నాయి. చాలాచోట్ల చెక్కు సున్నం రాలిపోయి, ఏ శైలునన్నా జ్ఞప్తికి తేగలవు. పురాతనంది కావటంవల్లనే గాబోలు, కిటికీలు తక్కువ వాకిళ్ళు ఎత్తు తక్కువ. నీటి పంపులు రెండు. అక్కడ రోజూ ముందు నీళ్లు ఎవరు తెచ్చుకోవాలనే దానిమీద దేవాసురయుద్ధం సాగుతూవుంటుంది. పంపు దగ్గిర పాచిపట్టి జారుతూవుంటుంది. మురికినీళ్లు సరిగా సైడ్ కాలవలోకి పోవు. వాసన. అద్దె ఒక్కొక్క భాగానికి 20 రూపాయలు; లాంతర్ వెలిగించితే ఆ వెల్తురు చాలదు, అక్కడి చీకటిని పోగొట్టటానికి. పగలు పెంకుటికప్పులోని రంధ్రాల్లోనుండావొచ్చే సూర్యరశ్మి కొంత వెల్తుర్నిస్తుంది; గాలి అట్టే ఆడదు, అక్కడి వాళ్లు దానికి అనర్హులన్నట్టు నేలగచ్చుగూడా లేచిపోయి, గతుకులు గతుకులుగా, వుంటుంది; పొరపాటుగానైనా, నీళ్ళచెంబు

పడితే గభీమని దొర్లిపోతుంది. ఏ క్షురి చేసుకుని భోంచేస్తాంటే, పోసిన ముద్దగ, అన్నంలో నిలవక, పళ్లెంవేపు పరిగెత్తుతుంది. ఇన్ని అవలక్షణాలు ఇట్లావున్నా, అక్కడ నివసించేవారు ఒకందుకు సంతోషిస్తారు. గోడలున్నాయిగావూ? అందుకని

శనివారాల్లో, రాత్రిళ్లు, అక్కడి గుమాస్తాజీవాలన్నీ ఉమ్మడిపోల్లో, ఈతచాపమీద చేరి, ఒక లాంతర్ పెట్టురు సాయంతో, చీట్లపేక ఆడతారు. భాస్కర్రావు వొచ్చిన రెండో రోజే శనివారం అయింది. అదివారం కొట్లల్లోకి వెళ్ళక్కర లేదన్న ధీమాతో అందరూ కూచున్నారు. భాస్కర్రావుగూడా సుందరంగారింటినించి 9 గంటలకి తిరిగి వచ్చాడు. అతనూ, ఈ సమావేశానికి వచ్చాడు. ఒకర్ని ఒకరు పరిచయం చేసుకున్నాక, పేకాటకి ముందు సంభాషణ ఆరంభమైంది.

భాస్కర్రావు, తనకి ఎదురుగుండా కూచున్న కళ్ళజోడు పెట్టుకున్న పక్కపల్చనిఆయన్ని—ఆయన పేరు అమరయ్యగారు, అడిగాడు, "మీరు చాలాఏళ్ళబట్టి ఇక్కడ ఉన్నారుగదా, గోడలకి సున్నం కొట్టించమని ఇంటియజమానిని అడగలేక పోయారా!" అని.

అమరయ్యగారు గొంతు సవరించుకొని, "అడక్కపోవట మేమిటండీ, నేను ఈ ఇంట్లో ప్రవేశించినప్పుడే అడిగాను. 'పోయిన పుష్కరానికేగదుటయ్యా ఇరవైరూ. ఖర్చుపెట్టి సున్నం కొట్టించాను! అప్పుడే ఏంతొందర?' అని ఎదురు ప్రశ్నించాడు. ఊరుకున్నాను" అన్నాడు.

"చాలాబాగుంది" అన్నాడు ఇంకోఆయన.

"ఆలెఖ్ఖకొస్తే ఇల్లంతా పాడుగానే వుంది. ఎప్పుడు బాగుచేయిస్తాడోగాని" అన్నాడింకోఆయన. ఆయన ఆయింట్లో ప్రవేశించి మూణ్ణెల్లు కాలేదు.

భాస్కరం, "రిపేరేమిటండీ - మొత్తం ఇల్లు తిరిగి కట్టవలసిందే. ఇది ఏశతాబ్దంలో కట్టిందో" అన్నాడు.

అమరయ్య అందుకున్నాడు, "ఆమాటంటే కరక్టే నాయన. ఇది ఆయన ముత్తాత ముచ్చటపడి కట్టించాడట, వేరుశనక్కాయలవ్యాపారంచేసి" అన్నాడు.

"అందుకని—ఊరుకుంటాడా రిపేరు లేకండా? మొన్న నీకు తెలుసుగా అమరయ్యా! మా మూడో అమ్మాయి దొడ్డిగుమ్మం పట్టుకు నుంచుంది. అది ఎన్నాళ్లనించి పడదాం పడదాం అని చూస్తోందో ఏమో, దభేలుమని పడిపోయింది! ఇంకా నయం అమ్మాయి మీదపడలేదు. ఈ దెబ్బకే పాడిలి మూడురోజులు జ్వరపడింది" అన్నాడు, అమరయ్యగారి పక్కనే కూచునివున్న పెద్ద సంసారి మల్లికార్జునరావు.

"నీకు తెలియదయ్యా బాబూ! ఇంటాయన నాతో అన్నాడుగా మొన్న ఒకసారు; ఈ ఇల్లంట, పడిపోతే, మేడ కట్టించాలని వుద్దేశంట. వీళ్ళ నాన్నకీ అదే వుద్దేశం వుండేదిట. అది ఎంతకీ పడిపోలేదు. ఆయన చచ్చిపోయినాడు. ఈయనా చూస్తున్నాడు, దానంతట అది కూలిపోతే, పడగొట్టించే ఖర్చు తప్పుతుంది గదా అని," అన్నాడు అమరయ్యగారు.

"అమ్మ నాయనో! మనం వుండగానే అది పడిపోతే ఎట్లాగండీ? పిల్లాజల్లా గలవాళ్ళం! అదేం వుద్దేశం వెధవ వుద్దేశం. [illegible]నూ! అద్దెకి నెల కాకముందే తగులుకుంటాడు! [illegible] [illegible]." అన్నాడింకో ఆయన.

"ఆయనకి డబ్బు ఒక్కటే శాశ్వత సత్యం. [illegible] మరి! [illegible]గాక రెండు మేడలున్నాయి. ఏభైవేల [illegible]ంటుంది. అద్దె ఖరాలుకైనా గుమాస్తాను పెట్టడు. తనే సిద్ధం. ఆ ఏభైవేలకి ఇంకా చేర్చటమే ఆయన ఆశయంగాని, ఖర్చుపెట్టడం కానే కాదు. పైగా ఈ ఇరవై రూపాయల అద్దె చవకట. ఇంకా పెంచాలట. తోటివారిలో తలవంపులుగా వుందట. ఇంకో గొప్ప మాట చెప్పాడండీ ఆయన. వింటానికి రెండు చెవులు చాలవు" అన్నాడు అమరయ్యగారు, ఆసక్తిని రెచ్చగొట్టి.

భాస్కర్రావు, "ఏమిటండీ అంత గొప్పమాట?" అని ప్రశ్నించాడు.

"మరేమీ లేదండి. అద్దె మరోక ఐదురూపాయలు పెంచి, ఆ ఐదులూ పోగుచేసి, తిరపతిలో ఈయనపేర ఒక రేకులషెడ్డు కట్టిస్తాడట."

"రేకులషెడ్డు ఏమిటండోయి."

"తిరుపతిలో మొక్కుబడి తీర్చుకునేవాళ్ళు, ఎండలో క్షవరం చేయించుకుంటూ చాలా ఇబ్బంది పడుతున్నారట. వాళ్లకి కాస్త నీడన క్షవరం అయిపోడానికి వుపయోగిస్తాడట, దాన్ని. ధర్మాత్ముడు! బాగోలేదూ?"

"దివ్యంగా వుందండి. మన్నిక్కడ క్షవరంచేసి, అక్కడ క్షవరశాల కట్టించడం వుందే, మహా గొప్ప ధర్మమండి!" అన్నాడు భాస్కర్రావు మండిపోయి

"మీరలా ఫైర్ అయిపోగూడదండి. వీట్ని మనం ఎంజాయి చెయ్యాలి. ఎందరో మన్ని ఎన్నోరకాల క్షవరం చేస్తూనే వున్నారు. కొంత ప్రత్యక్షంగా, చాలా పరోక్షంగా; అంతే తేడా." అన్నాడు అనుభవశాలి ఐన అమరయ్యగారు.

సభ్యులు—చీట్లపేకలోకి దిగారు. సంభాషణ మానేసి అదొక్కటే వాళ్ళకి వినోదాన్నిచ్చే సాధనం. సినిమాలూ, డ్రామాలు, పాట కచేరీలు డబ్బిస్తేగాని వినోదాన్నివ్వవు. సినిమాల డ్రామాల మాటకివస్తే, వాటిల్లో కొన్ని డబ్బు ఇచ్చినా, వినోదాన్నిమాత్రం ఇవ్వలేవు. తలనొప్పి వేరే తగులుకుంటుంది ఉపరి. అందువల్ల ఆ గుమాస్తాజీవులు డబ్బుతో నిమిత్తంలేని చీట్లపేకవినోదంతో తృప్తి పడతారు.

## 31

సుదర్శనంగారు అల్లుడు తన యింట్లోకి ప్రవేశించాక ఎంత తగలేశాడో లెఖ్ఖలు చూసుకుంటున్నాడు. గడచిన వేసవిలో సరోజని పెళ్ళి అయింది. మళ్ళీ వేసవి వచ్చింది; ఈ పన్నెండు నెలల్లోనూ, శేఖరం, సాదరుకింద పదివేలదాకా కర్పూరంలా ఆర్పేశాడు. ఈ పదివేలూ సుదర్శనంగారికి ఒక లెఖ్ఖకాదు; ఇంకో ఏభైవేలయినా సరోజని సంతోషం నిమిత్తం సుఖంగా ఖర్చుపెట్టగలడు. సరోజని సుదర్శనంగారిని ఆఫీసు గదిలో కలుసుకుంది, ఆయన లెఖ్ఖలు చూసుకుంటూ వుంటే.

"ఏమమ్మా! పనివుండి వచ్చావు! రెండు నిమిషాలుపోతే నేనే వచ్చేవాణ్ణి" అన్నాడు ప్రేమగా.

సరోజని ఆయన కుర్చీ చేతులకు ఆనుకొని నుంచుంది. ఏదో సుస్తీగా వున్నట్టుంది. సుదర్శనం ఆమెవంక కొంచెం పరిశీలనగా చూశాడు. "ఏమిటీ తల్లీ సుస్తీగా వున్నట్టున్నావు. చెప్పు అమ్మా!" అని ప్రశ్నించాడు, ఆమెజుట్టు చేత్తో దువ్వుతూ. "అదే నాన్నా నీతో చెబుదామని వచ్చాను." అంది ఆమె.

"ఏమిటమ్మా అది?" దిగులు ఆవరించింది సుదర్శనంగారిని. ఇంతవరకు [illegible] రెక్కలూ అనారోగ్యం ఎరగదు.

# 4 ఔషధములు చేరినట్టిది



అనాసిన్ శాస్త్రయుక్తంగా నాలుగు ఔషధముల కలయికతో తయారింప బడినది, త్వరితంగ బాధనివారణకై హామీయివ్వుటకు కారణం. ఇందులో కలసియుండు ఈ ఔషధములే

1. క్వినైన్: అధిక శక్తినిచ్చు ఔషధమని మరియు జ్వర నివారణియని ప్రఖ్యాతిగాంచిన ఔషధ సమ్మేళనం, జ్వరాన్ని తగ్గించడంలో సాటిలేనిది.

2. కఫీన్: బలహీనానికి మరియు చిక్కిపోయినందులకు తగిన ఔషధమని విరివిగా వాడబడుచున్నది.

3. ఫినాసిటిన్: తీవ్రమైన బాధా నివారణి మరియు జ్వర నివారణియని ఖ్యాతిచెందినది.

4. అసిటైల్ సాలిసిలిక్ ఆసిడ్: ఇది తలనొప్పి, మరియు అలాటి వివిధ బాధలను పోగొట్టుటకు ఉపయోగబడు చున్నది.




వైద్యశాస్త్ర రీత్యా లేత సమ్మేళన శక్తిచేత అనాసిన్ మాత్రం, త్వరితంగాను, నిరపాయంగాను, దృఢంగాను, బాధలనుండి, తలనొప్పి, జలుబు జ్వరం, దంతపు నొప్పులు, కండరముల నొప్పులు, వాయువు నొప్పులు మొదలగు బాధలను నివారించును.



ఎల్లప్పుడును

**అనాసిన్**

బిళ్ళలే

కావలెననికోరండి

2 మాత్రలుగల పాకెట్లులందును మరియు 32 మాత్రలు గల అపహరించలేని డబ్బాలందును దొరకును.

నుండీ—ఈ ప్పొద్దున పారులేక. రంగయ్యగారు వచ్చి కూర్చునుకూ తన కూలివాళ్ళింకా పారు లేకదని తిడుతూ అటూయిటూ కొలుగాలిన కోతిలా గంతులేస్తున్నారు. అయిదు నిముషా లయ్యేసరికి నారయ్యగారు పై పొలాన్నుంచి అక్కడికొచ్చి "ఏంటిరా కూలాళ్ళని కుంచో పెట్టి, తందనాలాడుతున్నావ్?" అని గద్దించాడు.

రంగయ్య "ఆళ్ళు యూము సేపయింది వెళ్ళి—ఇంకా పారు లేలేదు— ఏంజెయ్యనే బాబా?" అన్నాడు. నారయ్యగారు "తూరుపువు తిరిగి దణ్ణంపెట్టు" అని నవ్వారు. రంగయ్యగారు "అందుకే యీ వ్యవసాయం నావల్ల కాదే అంటే—" అని విసుగ్గా తలగుడ్డతీసి దులిపాడు. నారయ్యగారు నవ్వి "అఘోరించావుగానీ, నలుగురు కూలాళ్ళ నెక్కువబెట్టి యుండే వారు పీకించుకుంటే యిట్లా ఎందుకవుతుందిరా? అవసరమైనపుడుగాక యింకెప్పుడురా నువ్వు కూలాళ్ళ కిచ్చేది? పొలాల తక్కువకి చేరమాడితే యిలాగేవుంటుంది పని.. అదుగో మా బండొస్తోందిగానీ, దానిమీద్ది నాలుగు పోగులు నారు దింపుకో... కావలసొస్తే, మా పాలేళ్ళచేత మీ మడిలోది తెప్పించుకుంటాను—నా చేనుకి" అన్నాడు. బండి ఆపి నారిప్పించి —"వ్యవసాయమంటే ఎంతో మెళుకువగా చేసుకోవాల్రా" అంటూ వెళ్ళిపోయాడు నారయ్యగారు.

ఆ సాయంకాలందాకా ఆయన తన పొలానికి రానేలేదు "ఇదేనా యీయన మెళుకువ? ఇతర్లకి చెప్పడంవరకే గావల్ను" అనుకున్నాను. వారి పాలేళ్ళని పిలిచి అడిగితే "ఆయనగో రప్పగించిన పనంతా చేశాం గదండీ—ఆయనగోరు దగ్గరలేకపోతే మాత్రమేం—రేపు పొద్దున్నే పొలంజూచి, మాపని బాగా, సరిపడినంతా లేకపోతే మమ్మల్ని బదకనిస్తారా" అన్నారు. "కూలీలని దంపుకుతినే రకం గావాల్ను" అనుకున్నాను పొద్దుగూకేవేళ యింటికి తిరిగొస్తుంటే నారయ్యగారు బస్సు దిగారు చేతిలో అరటికాయలగెల వుంది "ఎక్కడికెళ్ళారండి?" అన్నాను.

"గుడివాడెళ్ళి ఎరువులు కొనొచ్చానండీ—మళ్ళీ ప్రియమవుతయ్యనీ" అన్నారు. ఇంతలో కూలీలు కూడా రొచ్చేక్కారు నారయ్యగారు అరటిగెల మేస్త్రీని ఎత్తుకోమని "మన పనిలో కొచ్చివాళ్ళందరికీ సమానంగా పంచియివ్వరో, గంగా" అని హెచ్చరించి వెళ్ళిపోయారు

గంగులు "గొర్రెపిల్లని చేరమాడుతన్నారా" అన్నాడు. "నాలుగు రూపాయ లెక్కువయినా మంచిదిజూసే కొనరా. కే

ప్పొద్దున్నే వచ్చి చూచ్చిపోతెళ్ళు. సంక్రాంతినాటికి గిత్తదూడంత బలిసింకాలి సుమా" అని చెప్పి వెళ్లారు.

నేను గంగుల్ని "సంక్రాంతికి సందేనికా, కత్తిపండేనికా?" అని అడిగాను గంగులు "దొరోరికోసం కాద్దొరా—సాలు పొడుగునా పనిజేసే పాలేళ్ళకి కూలోళ్ళకి పంటలబగుమతిగా గొర్రెని తెస్తారు యీ దొరోరు—దల్లని తండి" అన్నాడు...

*   *   *   *

నలుగురు రైతులమధ్య పోటీనీళ్ళు ఎవరిచేలోకి ముందెళ్ళాలీ అనే విషయందగ్గర తగూలొచ్చి పదిరోజుల్లాకా పెద్దలదగ్గర పంచాయతీలో నలుగుతున్నారు. ఎంతకీ తేలడంలేదు. ఊడ్పుల తరుణం దాటిపోతూంది. ఎవరికీ ఏంచెయ్యడానికి తోచడంలేదు. ఎవరిచేలోకి కన్నం తీస్తే, వాళ్ళ తలమీద మిగతా ముగ్గురి కర్రలూవచ్చివడే పరిస్థితి. ఆ పదో నాటిసాయంకాలం చెట్టు కిందపదుగుర్లోనూ నిలబడి ఆ నలుగురూ బూతుల పంచాంగాలు వదులుతూండగా నారయ్యగారు కారు దిగాడు.

నాలుగుమాటలు వినగానే ఆయన నలుగుర్నీ నాలుగురకాలుగా కూకలేసి, "ఇటా

వంతులకి పోటీలోపడి మీ నలుగురిచేలూ ఎండుతుండా చూడున్నయేం... పర్వతపోతే యీ పాటికి నూనలంకూడా బదికేయే. (ఎండిపోతుంటే చేలో ఫూడ్చినవారు బతకటాన్ని "మూనబదకడం" అంటారు.) మీ తగాదా అంతా తరవాత చూసుకుందురుగాని, ముందు చేలు తడిపి, ఫూడవండిరా" అని చెప్పాడు.

అందులో ఒకడు "ఎవరిదిముందు తడపాలో నువ్వే చెప్పవే—నాది బోదిపెంగనుందిగందా" అన్నాడు.

రెండోవాడు—"నాది పల్లంగందా—పక్కయ్యన్ని తడిస్తే పురకేసి, చత్తుడుట్టదూ"అన్నాడు. మూడోవాడు "నా నారు తీతకొచ్చింది, ముదిరిపోదైపోదా" అన్నాడు. నాలుగోవాడు "వంతుల ప్రకారం, నాది దిగువచేనుగనక, ముందు తడవాలిసింది"నన్నాడు. నారయ్యగారు తుప్పుక్కునవ్వూసి "ఇక మీకూ కొట్లపుక్కలకీ తేడా ఏమిట్రా? మీరు నోళ్ళు మూసుకుని యిళ్ళల్లో కూచోండి. నేను రేపిపాటికి నలుగురిచేలూ తడిపి నాట్లేయిస్తాను" అన్నాడు. మళ్ళీవాళ్లు మాట్లాడబోయేసరికి, కళ్ళెర్రజేసి "నామాటమీద నిలబడతారా, లేదా?? పొండిక—పొలంపనిసేజూస్తాను"

20 రూపాయలకే ఒక మంచి రేడియో

5 వాల్వులు! 8 బాండ్లు! ఏ. సి. కరెంటు రేడియో! లేక డ్రైబ్యాటరీ రేడియో! అన్ని ఫారెన్, ఇండియన్ స్టేషన్లు అందుకొనేది! పుడెన్ కాబినెట్! స్పీకరు, పికప్ వాడవచ్చును. వివరములకు ఈరోజున వ్రాయండి.

ఆంధ్రదేశమునకు బుష్ అండ్ మెరిల్ రేడియోల డిస్ట్రిబ్యూటర్లు:

నారాయణ్ రేడియో స్టోర్సు

(గవర్నరుపేట కాఫీ హోటల్సు సెంటర్ మేడమీద)

గవర్నరుపేట :: బెజవాడ-2




రవి వెజిటబుల్ హేరాయిల్ శిరోజములను పెంపొందించి, దుమ్మిద నలుపుగనుంచి, కేశ సౌందర్యమునకు తోడ్పడును

రవి గ్లిసరిన్ సోపు, అన్ని కాలములలో వాడదగినది. శరీరమును మృదువుగను కాంతిగను ఉంచును.

సోల్ ఏజంట్లు ది న్యూ స్టార్ & కో.,

తండియార్పేట, 10, వైద్యనాద మొదలి వీధి, మద్రాసు-21.





సిమ్లా రైల్వే స్టేషన్

 క్రిష్ణ 

అని హుంకరింస్తారు వాళ్లు తిక్కిన చేసుక్లా వెళ్ళిపోయారు

ఆ రాత్రే ఆబోదికి నీరెక్కువ వదిలేటట్లు ఓవర్సీరును ప్రతిమాలి, తెల్లవారేసరికి నాలుగు చేలూ తడిపించి, నారువంచి, మూడువు సాయంకాలానికి ముగించి— ఆ తర్వాతే నారయ్యగారు ఆ జోడైగట్లు మీద కునుకు తీశారని విన్నాను

* * *

ఆ రోజున మా పుత్రవాడి గోల మరీ యెక్కువగా వుంది వాడి హూరాం మాన్పడానికి రోడ్డుమీదికి తీసుకెళ్ళాను అక్కడున్న బడ్డీని చూచినప్పట్నుంచీ వాడు నా యెముకలు కొరికేశాడు ముందు బిళ్లలడిగితే కొనీవి కొనిచ్చాను అవి పరవగా నమిలేశి జేబ్లిన్నాడు. అవి యిప్పించేదాకా అరునొక్క క్షణం ఊరకోలేదు అవి కొంగానే సెనగపప్పు ఇక భరించలేక నాకు గంటించాను నాకు నేరు నేరుమని వినుకొస్తాంటే క్రిందికి తోసేసి కూర్చున్నాను వాడు ఊరేదిని కావిలించుకుని వెంటపెట్టుకుంటూంటే నాకు వళ్లు మండుకు పోతోంది

ఇంతలో అయన కొచ్చాడు చంకల్లో యిద్దరు పిల్లలూ, వెంట మరో డజను మందిని వాళ్లందర్నీ అనునయంగా అడిగి ఎవరేది, ఎంతకావాలంటే అంతా యిమ్మని బడ్డీ యజమానికి చెప్పాడు "ఎందుకోయ్ అట్లా యేడుస్తున్నావ్" అంటూ మా పుత్రవాణ్ణి యెత్తుకుని, ముద్దులు పెడుతూ— "ఛా ఛా — పుత్రుడు గుక్కపెట్టి యేడుస్తాంటే, వదిలిపెట్టి కూచున్నావేమయ్యా?" అని నన్ను మందలించాడు బడ్డీలో మా పుత్రుడికి కావలసిన వేమిటో చెప్పమని, యిప్పించి, 'ఇక యింటికెళ్లు, మళ్లీ ఏడిస్తే అడిగావంటే మీ నాన్న వూరుకోడు" అని పంపించేశాడు నేనంతకు ముందు ఎన్నిసార్లు చెప్పినా వెళ్ళనివాడు— నారయ్యగారి మాటవిని యింటికి వెళ్ళిపోయాడు

ఆయన పిల్లలందరూ అవీ యివీ తిని, తోచినాయే సెనక్కాయల చెటిని పిలిచారు ఆయన వాళ్ళకి తలో అణావి యిప్పించి యిళ్లకు పంపించాడు ఆయన ఓపికా, లాలనా చూస్తే నాకు సిగ్గేసింది

* * *

ఒకప్రక్క ధాన్యం మాసూళ్లు; రెండో ప్రక్క చెరకు కొట్టి మిల్లుకు తోలడం; యింకోవైపు రాయి తీయించడం, రోజూ పొరుగూళ్ళలో పనులు; ఆఫీసర్లతో మంతనాలు, కొత్తయిల్లు కట్టించడం; ఊళ్ళో తగాదాలు తీర్చడం - యిన్ని పనులూ ఆయనొక్కడే చూచుకునేవాడు ఇప్పుడిక్కడ, కాస్సేపటికి మరో వూళ్ళో, మధ్యాహ్నానికి కింకో బస్తీలో; సాయంకాలానికి సైకిలుమీద ప్రయాణంలో; రాత్రికి యింకో పొలంలో కనిపించేవాడు తన పనులేగాక, పెదల్లుడివి, చిన్నల్లుడివి; పొరుగువారివి, ఆశ్రయించినవాళ్ళవి, అన్నదమ్ముల వ్యవహారాలు - అన్నీ ఆయనే చూచేవాడు ఆయన చక్కబెట్టేస్తున్న పనుల్ని లెక్కవేస్తే వందకి మించుతయ్యని నా నమ్మకం వూళ్ళోవాళ్ళు ఆయన్ని అందుకనే గావల్ను "రోజుకి నూటొక్క పనులు చేస్తేగాని నారయ్యగారికి నిద్ర పట్టదు" అనేవారు వినని చెప్పినా, వింటున్నా ఆయన కొంచెం అలసటగాని, విసుగుగాని తోపింపచేసేవారు గాదు అంతా మంచినీళ్ళ ప్రాయంగా, చిటికెలమీద, రెండోకంటికి తెలియకుండా చేసేసేవారు.

మనుమరాళ్ళ పురుళ్ళూ, గుడ్డలూ, పద్దాలదగ్గరనుంచి— రైతుల ఆర్థిక ప్రణాళికలవరకూ అన్నీ ఆయనకి కొట్టినపిండి ప్రతీ పనినీ మానవత్వం తో జేకిసలా చే, మంచి యంత్రంలా నిర్వర్తించేవాడు ఆస్తి 80 ఎకరాలవరకూ వుంది దొడ్డినిండా గొడ్లు, నిండైన ధాన్యపుకొట్లు, పెద్దపెద్ద లోగిళ్లు ఇన్నీవున్నా ఆయన "సుఖం అనేది ఎరగడు" అన్నారు కొందరు "ముప్ఫయ్యేళ్ళ కొడుకుండగా తనింకా రాత్రింబగళ్లు, నిద్రాహారాలు లేకుండా తిరగడం ఎందుకూ—చాదస్తమూ, ఆరాటమూగాని" అన్నారు మరికొందరు నాకూ ఆ అనుమానాలు లేకపోలేదు

ఆ సాయంకాలం ఆరుగంటలవేళ



## సిమ్లాలో షికారు

ఆయన్ని అడిగాను—"ఎందుకండీ మీరింత ప్రయాసపడడం?" అని ఇంతవరకూ ఆయన్ని యిలా అడిగినవాళ్లు లేరనుకుంటాను లేక ఆరోజున ఆయన మనసు కొంత మథనలో పడేసి వుండొచ్చు నెమ్మదిగా—"ఏం శ్రమలే! శ్రమనుకుంటే కుర్చీలోంచి లేవటంకూడా శ్రమే అనిపిస్తుంది కాదూ అనుకుంటే ఏపనీ కాదు. ప్రతీ పనీ మనవల్ల అవుతుందీ అనుకుని పూనికతో చేస్తే, కొండల్ని పిండిగొట్టవచ్చు, అదీగాక, నేను శ్రమపడకుండా కూర్చుంటే గడవదా అని అంటారుగాని— తింటూ కూర్చుంటే ఎంతయినా హరించుకుపోదూ? ఇంతమందీ యీరోజున యిట్లా హాయిగా బతకడానికి వీలుండేదా—నేనే తృప్తిపడి కూర్చుంటే?" అని అడిగారు

నిజమే ఆ తర్వాత నాకు తెలిసిన విశేషాలనిబట్టి ఆయన బంధుమిత్రుల్లో పది పన్నెండు కుటుంబాలు యీరోజున కలకలలాడుతూ వున్నాయంటే ఆయనంత శ్రమపడడంవల్లనే అని తోచింది తన 20వయేట పెళ్లిచేసుకుని 80 వయేట పెత్తనం చేతబట్టాడు నలుగురన్నదమ్ములకూ కలిసి 20 ఎకరాలు వుంది ముగ్గురు అక్కచెల్లెళ్లు ఆరోజుల్లో కూరగాయలూ, జొన్నపంటా తప్ప యిక్కడ మాగాణిలేదు ధరలూ అతి హీనదశలో వున్నయ్

అలాటిపరిస్థితినుంచి పదేళ్ళలో అక్కచెల్లెళ్ళ పెళ్ళిళ్ళు, కట్నాలూపోను, అన్నదమ్ములకి పదేసియెకరాల మంచిమాగాణీ, ఒక్కో యిల్లూ, చావడీ, నాలుగుజతల గొడ్లూ చొప్పున పంచిపెట్టాడు ఆ తర్వాతయినా, ఆ అందరి కార్యకలాపాలూ తన అధ్వర్యంకిందనే జరిపేవాడు మరో పదేళ్ళకి తనకి 80 ఎకరాలు చేసుకోవడమే గాక — కొంప, రెండు చావిళ్ళూ కట్టించాడు, అన్నదమ్ముల్లో ఎవరికీ 20 ఎకరాలకు తక్కువ లేకుండ చేశాడు తన ముగ్గురుకూతుళ్ళకీ గొప్పగొప్ప సంబంధాలు చేశాడు - పాతికేసివేలు కట్నాలతో

"నాకూరికే ఒక్కరోజుకూడా కూర్చోబుద్ధికాదుసుమండీ" అన్నాడు కాని ఒక్కక్షణంకూడా కూర్చోడని నా కర్థమయింది రాత్రి ఏ నాలుగ్గంటలసేపో నిద్రతప్ప ఇంక ఆయనకి నడుం వాల్చుకునే తీరిక్కూడా వుండదు చేతినిండా అంత పనుంటేనే గాని ఆయనకి కడుపునిండా తృప్తి, కంటినిండా నిద్రా వుండదు

ఆసాయంకాలం అలా మాట్లాడి, ఆయన చెప్పిందివిని ఇంటికెళ్లాను భోజనాలతర్వాత 10 గంటలదాకా రామాయలయందగ్గర పదుగురితోనూ ఏవో విశేషాలు చెబుతున్నారాయన తెల్లవారు ఝామున ఏదో వూరికి ప్రయాణంవుందని కూడా చెప్పి, పాలేళ్ళని హెచ్చరించారు అక్కడినుంచి కొంత మీదకెళ్ళి పడుకున్నారు అరగంటతర్వాత యిల్లంతా గోల్లుమన్నారు

వూరంతా కదిలివచ్చింది నాకయ్యగారు నిద్రలో లేచి ప్రక్కనే పడుకున్న అల్లుణ్ణి పిలిచారట ఏ మాటా చెప్పకుండానే ప్రక్కకు వత్తిగిలి పడుకున్నారట అంతే మళ్ళీ పిలిచినా పలకలేదు "ఒక్క మాటన్నా చెప్పలేదు"—

"అరగంట కిందటకూడా పొలంపంటల సంగతి చెబుతున్నాడు"

—"గొడ్లకి మేతకూడా వేసివచ్చాడు"—

ఈ విధంగా చెప్పుకుని అంతా యేడుస్తున్నారు "ఏభైయేళ్ళకే చావొచ్చిందా— తీసుకున్నా మంచంలో వాలుగోక్షణంతే ఘటమే నెయ్యిమింగిపోప్పాశేనాడు" అని విస్తుపోయారు—చుట్టుపక్కలవాళ్ళు

ఆయనకి 50 ఏళ్ళంటేనే నొప్పికోను ఒక సమర్థుడు 200 ఏళ్ళలో సాధించలేనన్ని పనులు, ఆయన సాధించారు

"దేశానికేం చేశాడయ్యా నువ్వాయన్ని పొగుడుతున్నావ్?" అన్నాడు మిత్రుడు నన్ను "సమాజంలో పదికుటుంబాల ఆర్థికోన్నతికి పాటుపడ్డాడు వూరందరికీ కావలసిన పనుల్లో తనసహాయం చేశాడు రాజకీయవేత్తా, సంఘసేవకుడూ, వక్తా కాకపోవచ్చుగాని, వాళ్లవలే పొగడ్తలూ, ప్రచారాలూ లేకుండా పనిచేసి ఫలితాలప్పగించిపోయిన కర్మిష్ఠి ఆయన" అని సమాధానం నేటి రైతుకుటుంబాలల్లోనివారందరికీ—ఆయన జీవితం అత్యవసరంగా నేర్చుకోతగిన గుణపాఠం ★

మంచిచేసుకుని, పని కొత్తదయితే నేర్చుకోవాలి పై ఆఫీసరు ఏదయినా మందలిస్తే యింటకివెళ్లి ముసుగుతన్ని పడుకుని వుద్యోగానికి రాజీనామా యివ్వకుండా నలుగురి మధ్యా మాట నిలబెట్టుకోవాలి

లత : నాకు తెలీక అడుగుతాను! నువ్వు చెప్పిన చిక్కులు ఒక్క స్త్రీలకే ప్రత్యేకం ఉన్నాయంటావా? పురుషులుమాత్రం ఇటువంటి చిక్కులు ఎదుర్కోనక్కర లేదంటావా?

రమ : నీ వలా చెప్పకు! కొత్తగా వుద్యోగంలో చేరిన ఏయువకుడయినా అయిదునిముషాల్లో అక్కడి వారితో స్నేహం చేసుకుని, మధ్యాహ్నమయేటప్పటికి కిళ్లీకొట్టుదగ్గర సిగరెట్టు కాలుస్తూ వారితో అతి హుషారుగా ఖబుర్లు చెబుతూ ఆ వాతావరణంలో అతుక్కుపోతాడు. అది స్త్రీలకి ఎన్నటికీ సాధ్యపడదు. ఎవరితోనయినా నోరు తెరిచి మాట్లాడ్డానికి సంకోచిస్తాము. మనల్ని చూచీ చూడనట్లు వెళ్ళిపోయే ఆడపిల్లలనే స్వయంగా వెళ్లి పలకరించటానికి అభిమానం వెనక్కి తీస్తుంది. చెయ్యవలసిన పని బొత్తిగా కొత్తదయితే యిక అవస్థలు చెప్పనక్కర లేదు తోటి గుమాస్తాల ఆఫీసర్ల సహాయం పొందటం అంత సులభం కాదు. ధైర్యంచేసి పక్కవాళ్లతో కాస్త మాట్లాడితే కథలు అల్లడానికి సిద్ధంగా వుంటారు ప్రబుద్ధులు. ఆఫీసులో ఆమె స్థితి దుర్భరంగా తయారవుతుంది.

లత: నీవాదనతో నే నేమాత్రం ఏకీభవించను. అల్పవిషయాలన్నింటినీ ప్రమాదకరంగా వూహించుకుంటున్నావు. తోటి గుమాస్తాలు మనల్ని ఏదో పురుగులు క్రింద చూస్తారంటే నేనేం చెప్పను? నా అనుభవంమీద చెబుతున్నా. పక్కవాళ్లు మనకి ఎంతో సహాయం చేస్తారు. అంతేకాదు మొదట్లో కొంచెం జంకుగావున్నా ఆఫీసు వాతావరణం దానంతటదే అలవాటయిపోతుంది. మనం కాస్త పిరికివాళ్లమని తెలుస్తే ఈలలు వెయ్యటం, పిల్లికూతలూ నక్కకూతలతో విసిగించటం ఈ మొగవాళ్లకి ఎప్పుడూ వున్న జబ్బే!

ఇటువంటి అవస్థ కాలేజీల్లో మటుకు మనకి తప్పుతోంది గనక నా! జీవితంలో ఆమాత్రం యిబ్బందులకి తట్టుకోలేకపోతే ఎందుకు పనికివస్తాము చెప్పు! ఆఫీసంటే ఏదో నరకమనీ అక్కడ పనిచేసే పురుషులంతా పిశాచాలూ భూతాలూ అనీ ఊహించుకుంటూ స్త్రీలు ఉద్యోగాలు చెయ్యటంలేదంటే నాకు చాలా విచారంగా వుంది. తోటి గుమాస్తాలూ మనలాగే జీతంకోసం కష్టపడే వాళ్ళే! వాళ్లకీ హృదయాలంటూ వుంటాయి ఒక్కసారి కదిలించి చూడు వారు ఎంత చక్కగా మాట్లాడుతారో. ఆఫీసుపనుల్లో వారికి ప్రత్యేకమైన ప్రజ్ఞ వుంటుంది! మనలాగే కష్టపడి పనిచేస్తున్న అనుభవం సంపాయిస్తారు వాళ్ళూ మనలాటి వాళ్లేననీ, వాళ్లకీ బోలెడన్ని చిక్కులుంటాయనీ తెలుసుకోవటానికి ఎక్కువ రోజులు పట్టదు

రమ అయితే ఆఫీసు జీవితం స్త్రీలకి సరిపోదని వాదించే వారంతా మూర్ఖులంటావా? నువు చెప్పినట్లు మంచివాళ్లు లేకపోలేదు. కానీ ఎటువంటి విషయాలలో మార్పులవస్తే ఒక స్త్రీ వుద్యోగం చెయ్య

## ★ ఆఫీసుల్లో.... ★

టం సులభంగా వీలౌతుందో కాదో చెబుతా విను. ఒక స్త్రీ వుద్యోగానికి వెళితే పై అధికార్లు కొందరు ఒక్కోక్కప్పుడు విచిత్రంగా ప్రవర్తిస్తూంటారు. ఆమె ఒక అబలఅనీ, ఏదో అసాధరణ పరిస్థితులలో జీవనోపాధి కల్పించుకోవటానికి వుద్యోగం చేస్తోందనీ కపట సానుభూతి ప్రకటించటానికి ప్రయత్నిస్తారు చులకనగా చూస్తారు. చులకనమాట ఎలావున్నా ఎక్కువశ్రద్ధ కనబరిచారా, యింక ఆమెపని అయిపోయిందన్నమాటే. తతిమ్మవారందరికీ అనుమానం హెచ్చిపోయి ఆమెని హీనపరుస్తారు. చాలామంది వుద్దేశం ఆడవాళ్ళు వుద్యోగాలు చెయ్యటం మంచి చీరలూ, స్నో, పౌడర్లూ కొనుక్కోడానికీ, అక్కడి పురుషులతో కొంత సరదాగా తిరగటానికీ అని. ఆఫీసులో కొంత పనిపాడయినా, ఆలస్యమయినా ముందు ఆమెని అనుమానిస్తారు. ఈరకం చిక్కులనే భరించలేక నాకు తెలిసిన యిద్దరు ముగ్గురు స్త్రీలు వుద్యోగాలు మానేశారు వాళ్ళ కథలు వింటూంటే ఎంతో కష్టంగా వుంటుంది కొంత ఉత్సాహంగా మాట్లాడితే ఆమె స్నేహాన్ని దుర్వినియోగం చేసుకోవటానికి ప్రయత్నిస్తారు ఎక్కువ మాట్లాడకపోతే సంస్కారవిహీనురాలంటారు ఇటువంటి అభిప్రాయాలు వహించి పురుషులు స్త్రీలని గౌరవించి ఆఫీసుజీవితానికి అలవాటు పడేటట్లు చేయకపోతే, యువతులు ముందుకి రాలేరు నువ్వు స్త్రీవి అని ప్రతిక్షణం జ్ఞప్తికి తెస్తూ ఆమెని దూరంగా వుంచుతూ వింతమృగానిలాగ చూసినట్లు చూడకుండా, సానుభూతి చూపి, పురుషులు స్త్రీల యిబ్బందులని సరిగ్గా అర్థం చేసుకోవాలి ఎంత మంచిగా వుండటానికి ప్రయత్నించినా స్త్రీలకి అపవాదులూ వాటితో బాటు మనఃక్లేశాలూ తప్పవు

లత. నువ్వు చెప్పినట్లు మన అసహాయతనే అండగా తీసుకుని, 'నువ్వు సంపాయించవలసిన అవసరమేమిటి? నీకు అన్నదమ్ములు లేరా' అని చొప్పదంటు ప్రశ్నలు వేసి విసిగించే అధికారులూ, చులకనగా చూచేపురుషులూ లేకపోలేరు కానీయివన్నీ అంతగా పట్టించుకు కూర్చుని, వీళ్లేమనుకుంటున్నారో వాళ్లేమనుకుంటున్నారో అని ప్రతిక్షణం ఆలోచించుకుంటూ కూర్చుంటే మనశ్శాంతి ఎక్కడ వుంటుంది? ఇక యితరులు మనల్ని ఎక్కువగా పలకరించటము సదుద్దేశముతోనా, వెక్కిరించటమూ నవ్వుకోటమూ వివేకంతోనా అనే విషయాలు అనుభవంమీద మనకే బోధపడతాయి. ఇక ప్రవర్తన విషయమంటావా? స్త్రీలు [illegible] అసభ్యంగా ప్రవర్తిస్తే ఏ యిబ్బందీ లేకుండా వుద్యోగమే వూడిపోతుంది అసలు నన్నడుగుతే పొద్దుటునుంచీ ఆఫీసు ఘయిల్లున మధ్యే నలిగే పురుషులకి గానీ స్త్రీలకి గానీ, పక్కవాళ్లు ఎక్కువగా మాట్లాడుతున్నారా తక్కువగా మాట్లాడుతున్నారా, చులకనగా చూస్తున్నారా గౌరవిస్తున్నారా, సూటిగా చూస్తున్నారా వంకర టింకరగా చూస్తున్నారా అనే ఆలోచనలు తట్టవు ఎప్పుడెప్పుడు అయిదుగంటలవుతుందా, యిళ్లకి పోదామా అనే ఆలోచనలోనే వుంటారు ఈలాటి అపోహాలన్నీ ఒక్కసారి ఆఫీసులో అడుగుపెడితే వాటంతటవే నశించిపోతాయి

రమ. ఈ విషయాలెలావున్నా యింట్లో స్త్రీ పరిస్థితిలో మార్పు తప్పకుండా వస్తుంది ఇంట్లోవారంతా నిరుత్సాహ పరుస్తారు. ఎంత విశాలభావాలుకలిగి, ఎంతడబ్బు చిక్కుల్లో వున్న కుటుంబమయినా, ఆడపిల్ల వుద్యోగం చేస్తోందంటే ఎందుకో బాధపడతారు మా అమ్మనీ నాన్ననీ చూస్తే మటుకు నాకు బలే జాలివేస్తుంది యింటికొచ్చే బంధువులూ స్నేహితులూ 'మీ అమ్మాయి ఫలానాచోట వుద్యోగం చేస్తోందిటగదా' అని అడుగుతే, దమ్మిడీ అంత ముఖం చేసుకుంటాడు మా నాన్న. 'ఆ ఏదో తోచక చేస్తోందండీ!' అంటూ మాటలు మారుస్తాడు వివాహానంతరమేమోగానీ, వివాహానికి పూర్వము మటుకు సమిష్టి కుటుంబంలో వుద్యోగంచేసే వనిత ఎంతో నిరుత్సాహాన్ని ఎదుర్కొంటోంది కొంత తలపోటు వచ్చిందన్నా వుద్యోగం మానెయ్యమని అందుకుంటుంది అమ్మ

లత. నువ్వు లక్షచెప్పు! యింట్లో గౌరవంమాట దేవుడెరుగు. మా అమ్మమ్మ మటుకు వుద్యోగంచేసే వనితలకి గర్వం ఎక్కువవుతుందనీ పలకరించినా మాట్లాడరనీ అంటుంది చదువుకోని స్త్రీలు ఎంత గర్వంగా తలబిరుసుగావున్నా ఈ లక్షణాలు మన వుద్యోగాలకే అంటగడుతుంది ఈ ప్రపంచం నా ఆఫీసులో ఒకమ్మాయి సంగతి ఏమయిందనుకుంటావు! అన్నా చెల్లెలూ ఒకేచోట గుమాస్తాలుగా చేరారు చెల్లెలు తన ఆఫీసులో ఉద్యోగంచెయ్యటం అన్నకిష్టంలేదు తల్లిదండ్రులు గంజినీళ్లయినా తను తెస్తేనే తాగాలనీ, ఆడపిల డబ్బు ముట్టుకోవద్దనీ రోజూ తండ్రితో పోట్లాటవేసుకునేవాడుట. పాపం! ఆ అమ్మాయి జీతంతెచ్చి తండ్రికిస్తే భరించలేకపోయేవాడు వూళ్లో తన పరువంతా ఆ పిల్లవల్ల పోతోందనీ, ఆరోగ్యం చెడిపోతుందనీ అనేకవంకలుపెట్ట ఆ అమ్మాయిని చివరికి ఉద్యోగం మానిపించాడు [illegible] వాళ్లకి యిటువంటి సంకుచితభావాలూ, వింతమనస్తత్వాలూ పోతేగానీ ఆడపిల్లలు ఉద్యోగం చెయ్యటం కష్టమంటాను. వివాహితురాలయిన ఒక వనిత ఉద్యోగం చెయ్యటానికి ముఖ్యమైన అడ్డంకి పిల్లలంటాను డబ్బుచిక్కులు తొలగించుకోటానికి వుద్యోగంచేసే స్త్రీలకి పిల్లలకోసం ఆయాలనీ, పనిగత్తెలనీ నియమించే తాహతు వుండదు ఇక ఆపిల్లలు రెండుమూడు సంవత్సరాలవారయితే తల్లీ పిల్లా కూడా ఎంతో అవస్థపడవలసివస్తుంది నాకు తెలిసిన ఒకామె సంగతి చెబుతా విను ఆమెకి మూడేళ్ల కొడుకు. తల్లిని ఒక్కక్షణం వదిలిపెట్టేవాడు కాదు. రోజూ ఆమె ఆఫీసుకెళ్లే సమయానికి గుమ్మందగ్గర నిల్చుని గుక్కపెట్టి ఏడుపు లంకించుకొనేవాడు ఒక్కరోజయినా నవ్వుతూ చెయ్యివూపి ఆమెని సాగనంపేవాడు కాదు పిప్పరమెంట్లు తెస్తాననీ బొమ్మలు తెస్తాననీ అబద్ధాలు చెప్పి ఆ అబ్బాయిని పనిమనిషికి అప్పచెప్పి ఆమె ఆఫీసు కెళ్లటం బ్రహ్మాండమయిపోయేది ఆఫీసు కెళ్ళినప్పటినుంచీ పనిపిల్ల అబ్బాయికి తినుబండారాలు సరిగ్గా పెడుతోందా లేక తనే ఖాళీ చేస్తోందా అనే అనుమానంతో సాయంత్రం యింటికి రాగానే ఆపిల్లవాడిని సవాలక్షప్రశ్నలు వేసేది. పొద్దుటునుంచీ యింట్లో మాయమయే తల్లి సాయంత్రం యింటికిరాగానే ఆ అబ్బాయి తల్లి కొంగుపట్టుకుని ఆమె మళ్ళీ ఎక్కడికయినా వెళ్ళిపోతుందేమో అనే భయంతో బెంగగా తిరుగుతుంటే బలే దిగులేసేది ఆమె తెచ్చే జీతంతో అబ్బాయికి ఎన్ని టానిక్కులూ, బొమ్మలూ, బట్టలూ కొన్నా అతను చిక్కిపోవటం బెంగపెట్టుకోవటం మానలేదు చివరికి అటువంటి పరిస్థితికి తట్టుకోలేక ఆమె వుద్యోగం మానేసింది కనుక వివాహానంతరం చంటిపిల్లలు గల తల్లులు ఉద్యోగాలు చేసే అవకాశం చాలా తక్కువంటాను ఈ సమస్య మాట ఎలావున్నా, స్త్రీలు, వుద్యోగాలు చెయ్యటానికి సంకోచించకుండా ముందుకి రావాలంటే ఆఫీసుల వాతావరణంలో కొంత మార్పురావాలి ప్రస్తుతం స్త్రీలు ఉద్యోగాలు చేస్తున్నా మనదేశంలో యింకా అనేకమంది స్త్రీలు వుద్యోగాలు చెయ్యటానికి అనుకూలమైన మార్పులు రావాలంటాను

లత అదేం కష్టం కాదులే పదిమంది స్త్రీలు ఉద్యోగాలలో చేరుతున్న కొద్దీ వాతావరణం దానంతటదే మారుతుంది. స్త్రీలు, పురుషులుకూడా కొత్త పరిస్థితులికి తేలిగ్గా అలవాటుపడతారు. అనుభవాన్ని [illegible]

# దేశానికి ఆహ్వానం

మూడేళ్ల క్రిందట, 1951 మార్చి నెలలో భారత ప్రజలు జీవితాభ్యున్నతికై స్వయంకృషి ప్రారంభించారు. మన మొదటి పంచవర్ష ప్రణాళిక అధిక ఆహారోత్పత్తి, అధిక వస్త్రోత్పత్తి, సంఘసేవా కార్యకలాపాల అభివృద్ధి, అధికంగా ఉద్యోగావకాశాల కల్పన నిమిత్తమే తలపెట్టబడినది.

ఇంతవరకు కనిపించిన అభివృద్ధి ప్రోత్సాహకరంగా ఉన్నది. నవభారత నిర్మాణమనెడి ఘనతర ప్రయత్నానికై ఇప్పటికే మనం దాదాపు వెయ్యికోట్లరూపాయలు వ్యయపరచియున్నాము. ఆహారవిషయమై ఇక మనం బైటిసహాయంపై ఆధారపడవలసిన అవసరంలేదు. మనం తిలైయావంటి బ్రహ్మాండమైన ఆనకట్టలను నిర్మించుచున్నాము, బొకారోవంటి థర్మల్ పవర్ స్టేషన్లను నెలకొల్పియున్నాము, సింద్రీవంటి ఫ్యాక్టరీలను స్థాపించియున్నాము. చండీగార్ వంటి నగరాలను నిర్మించియున్నాము. మన రైలు ఇంజినులను మనమే తయారు చేసుకుంటున్నాము. మన మోటారుకార్లను, విమానాలను విడిభాగాలు పూర్తి స్వయంగా చేసుకుంటున్నాము. కమ్యూనిటీప్రాజెక్టులు, గ్రామీణ విస్తరణసేవలద్వారా గ్రామైశ్వర్యానికి మనం పునాదులు వేశాము.

సర్వతోముఖకృషి ఆవశ్యకత, అభివృద్ధి ఈవిధంగా ఉన్నప్పటికీ, మనం తలపెట్టిన లక్ష్యాలను సాధించుటకై ఇంకా మిగిలిన రెండు సంవత్సరాలలో సర్వతోముఖకృషి అవసరమైయున్నది. ఈ కృషికి వ్యయం నిమిత్తం ఇండియాకు ఇంకా దాదాపు పదమూడువందల కోట్ల రూపాయలు కావలసియున్నవి.

జాతీయ ప్రణాళిక ఋణం ఇప్పుడు ఎల్లరూ సమయోచితంగా సహాయపడవలెనని దేశప్రజలను హెచ్చరిస్తున్నది. పంచవర్ష ప్రణాళిక ప్రజల ప్రణాళిక కనుక ఈ ఉద్యమసాఫల్యానికై తమవాటాను చెల్లించుట ప్రజల విద్యుక్తధర్మం. ఈ విధిని మీరూ నేనూ కూడా తప్పక నిర్వహించాలి.

## నేషనల్ ప్లాన్ లోనుకు

ధారాళంగా చందా వేయండి

(సాలీనా 3½% వడ్డీ ప్రతి అర్ధసంవత్సరంలో చెల్లింపు)

ఇతర వివరాలకు వ్రాయండి: రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా, ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, ది హైదరాబాద్ స్టేట్ బ్యాంక్, ది బ్యాంక్ ఆఫ్ మైసూర్ లిమిటెడ్ వీటికి చెందిన ఏ శాఖకైనా, లేక ప్రభుత్వ ట్రెజరీ, సబ్ ట్రెజరీలలో దేనికైనా.

## నేషనల్ ప్లాన్ సర్టిఫికేట్లను కొనండి

(పరిపక్వమైనప్పటికి సాలీనా 4½% వడ్డీ)

ఇతర వివరాలు సేవింగ్స్ బ్యాంక్ పనులు గమనించు పోస్టు ఆఫీసులలో కూడా దొరకును

## ప్రణాళిక కనపరుస్తున్న అభివృద్ధులు

| | లక్ష్యాలు 1951—56 ప్రణాళిక కాలానికి | సాధించినది 1953—54 వరకు |
|---|---|---|
| ఆహారం | 76·0 లక్షలటన్నులు (ప్రతి సంవత్సరం అదనపు ఉత్పత్తి) | 60·70 లక్షలటన్నులు |
| ఇరిగేషన్ (మేజర్ ప్రాజెక్టుల ద్వారా) | 8 533,000 ఎకరాలు | 3,556,000 ఎకరాలు |
| విద్యుచ్ఛక్తి | 10 87,000 కిలోవాట్లు | 7,24,000 కిలోవాట్లు |
| కొత్త రోడ్లు | 870 మైళ్ళు | 447 మైళ్ళు |
| మిల్లుబట్టలు | 982 మిలియన్ గజాలు (ప్రతి సంవత్సరం అదనపు ఉత్పత్తి) | 1,163 మిలియన్ గజాలు |
| కమ్యూనిటీ ప్రాజెక్టులు గ్రామీణవిస్తరణస్కీము | 1,20,000 (గ్రామాలు) | 48,760 (గ్రామాలు) |
| కొత్త పాఠశాలలు | 49,695 | 29,723 |
| కొత్త ఆసుపత్రులు | 996 | 609 |

AC-566 TB

## ఇండియా భవిష్యత్తు నిమిత్తం పెట్టుబడిపెట్టండి

# ఊహించిన వరుడు

కంచి వాసుదేవరావు

"ఎందుకే నవ్వుతున్నావు?"

"నవ్వానా! ఏం లేదు..."

"ఏంలేదూ! ఎందుకే యింతలో అబద్ధం" అని పిన్ని మూతి ముడిచింది

తనని చూసి నవ్వానని పిన్ని అనుకుంది.. కాని ఎందుకు నవ్వాను? ఎప్పుడో జరిగిన ఏదో చిన్న వేళం గుర్తుకువచ్చి.. అప్పుడు మరోక విధముగా ప్రవర్తించివుంటే ఎల్లా వుండేదో వూహించుకుంటే నవ్వువచ్చింది. ఫలానందుకు నవ్వానంటే పిన్ని నమ్ముతుందా?

"ఏమిటే ఎప్పుడూ ఆలోచిస్తావు?" అంటుంది అమ్మ.

ఒకదాని గురించి ఏమిటి? నేను ఆలోచించని, వూహించని విషయమంటూ లేదు. "ఏ గడ్డం క్రిందికి చేతులు వెళ్ళాయి అంటే.. యీ లోకం విడిచి పెట్టి.. వూహాలోకాలకి వెళ్లినట్టు గుర్తు అన్నమాట" అంటుంది విజయ.

అల్లా కూర్చుని.. ఎంతసేపయినా, ఏదో ఆలోచించుకుంటూ కాలము గడిపివేయగలను.

ఒకసారి కాలేజిలో యింగ్లీషు లెక్చరరుగారు పాఠము చెపుతున్నారు ఆయన చాల నవనాగరికుడు కొంచెము స్థూలకాయుడు. నేను పాఠము వింటుము లేదు... ఆయనకో ఆకారము వూహించాను... ఆయన నున్నగా గుండు చేసికొని పట్టెడు వంగనామాలు ముఖాన్న తీర్చికొని, మెళ్లో చామంతి పూలదండ వేసుకొని, పట్టుపంచె కట్టుకుని, కాళ్ళకి గజ్జెలు కట్టుకొని చేత్తో చిడతలు వాయిస్తూ, ధనుర్మాసం పండగలో రాగయుక్తంగా పద్యము పాడుతుంటే ఎల్లా వుంటుందో వూహిస్తున్నా .. ఆయన కోపిష్ఠి. "ఎందుకు నవ్వుతున్నావు?" అని అడిగాడు, నన్ను చూసి.."

ఎందుకని చెపుతా! "వూరికే" అన్నా...

"అల్లా అయితే, నీవు వుండవల్సింది పిచ్చాసుపత్రిలో" అన్నాడాయన. క్లాసంతా గొల్లుమన్నారు

"అవును! అక్కడ మీ జాగా ఖాళీగా వుంటే ఎల్లాగ?" అని వెనకాల బెంచిలో ఎవరో అనేటప్పటికి క్లాసంతా మళ్లీ గొల్లుమన్నారు

యిట్లాంటివన్నీ ఎందుకు వూహించడము? నేను వూహించనివిషయమంటూ వుండదు... బయట వెన్నెలలో పడుకున్నప్పుడు వున్నట్టుండి యిల్లా పడుకుండగానే హఠాత్తుగా ప్రాణముపోతే, కనిపించే దృశ్యముగురించి. ఎవరు ఎల్లా ఏడుస్తారో వూహించుకుంటా!

ఎందుకని?.. ఏం చెప్పగలను? ఆకాశములో తెల్లని మేఘాలు ఎందుకు వెళ్తాయి.. యిల్లా వూహాలోకములో తిరుగుతూవుండడము నాకో కాలక్షేపము

నా జీవితము ఎల్లా వుండాలో నేను వూహించుకుంటూ వుంటా. చాలరోజులు నేను చదివి వుద్యోగాలు చేయడముగురించి వూహించుకుంటూ వుండేదాన్ని ... గాలి మేడలు కట్టుకుంటూ వుండేదాన్ని. కాని అదృష్టము ఏమిటంటే, నేను వూహించినవి జరుగకపోయినా, విచారమంటూ వుండేది కాదు దేనికివస్తే దానికి అనుగుణముగా మారిపోయేదాన్ని...

నాన్నగారు నాకు పైచదువు చెప్పించదలుచుకోలేదు. పెళ్లిచేయాలి అనుకుంటున్నారని తెలిసినా, నా చదువు పోతోందని విచారించాలా? అందాక నేను కన్న కలలన్నీ కాలదన్నేశాను. ఆతరువాత నాకు రావల్సిన వరుడు ఎల్లా వుండాలో వూహించుకుంటూ వచ్చేదాన్ని అతని ఆకారముగురించి,అతని గుణగణాలుగురించి, హోదాగురించి వూహించేదాన్ని

నేను వూహించిన వరుడు చాల అందగాడు శ్రీరాముడు శ్రీకృష్ణుడు కున్నంత అందము, వారికున్నంత ఔదార్యము, ధైర్యము, సాహసము వుంటుంది. అతను పెద్ద వుద్యోగస్థుడు.. నన్ను ప్రాణముకన్న ఎక్కువగ ప్రేమిస్తాడు...నా కళ్ళలోకి చూస్తూ, 'మాలతీ! నువ్వు నా ఆశాజ్యోతి' అంటాడు. నన్ను చూసి ఆయన గర్విస్తాడు. ఆయన్ని చూసి నేను గర్విస్తాను చూచిన వారంతా మేము ఎంత అదృష్టవంతులమో అనుకుంటూ వుంటారు...యీ విధముగా ప్రతిరోజూ ఎన్నో ఊహాచిత్రాల చిత్రించుకునేదాన్ని!

* * *

ఈ రోజున నన్ను చూడడానికి ఎవరో బొంబాయినుంచి వస్తున్నారు. అతను ఏదో కంపెనీలో కెమిస్టుగా పనిచేస్తూ అయిదు వందలు సంపాదించుకుంటున్నాడు వారి స్వగ్రామము రాజమండ్రి దగ్గర ఏదో వూరు అక్కడవారికి యిల్లు భూములు వున్నాయట యితను, ముగ్గురు అన్నదమ్ములు, యిద్దరు అప్పచెల్లెళ్ళలో పెద్దవాడుట. యిదీ అతని గురించి విన్న విశేషాలు. రెండుమూడు రోజులనుంచి, నాన్నగారు ఈ విషయమే మాట్లాడుతున్నారు

ప్రొద్దున్ననుంచీ, అందరూ వచ్చేవారిని ఆహ్వానించే సన్నాహాలలో వున్నారు. వారికోసము అమ్మ రకరకాల పిండివంటలు చేస్తోంది.. నాన్నగారు స్వయంగా, హాలు అలంకరిస్తూ వున్నారు. ఎప్పుడో నాలుగింటికి వస్తారనగా, రెండింటినుంచే, నన్ను ముస్తాబు అవమన్నారు

ఏవిధముగా అలంకరించుకుంటే ఆకర్షణీయముగా వుంటానో, తెగని సమస్యయింది. ఏచీర కట్టాలో, ఏ జాకెట్టు తొడగాలో, చివర జడ అల్లకుండా వుచ్చుగా వదిలివేయాలో, లేకపోతే చివరకి రిబ్బను పెట్టుకోవాలో, తలలో ఏ పూలు ఎల్లా పెట్టుకోవాలో, పాడమనగానే త్యాగరాయకీర్తన పాడాలో హిందీ పాట పాడాలో.. ప్రతివిషయము పెద్ద సమస్యయింది

వాళ్లు నాల్గుంపావుకి వచ్చారు. నాన్నగారు వారిని లోపలికి తీసుకువచ్చారు ఆయన, ఆయనతోపాటు యింకొక యిద్దరు వచ్చారు. వారూ, నాన్నగారు కుర్చీలలో కూర్చున్నారు నన్ను జంబుఖానామీద కూర్చోపెట్టారు. అతని మొగమువంక ఎల్లా చూడగలను? తలవంచుకొనే, చూసీచూడనట్టు అతన్ని పరీక్షించా. మెరుస్తున్న బూట్లు, తెల్లని పాంటు, ఆకుపచ్చని బుష్‌కోటు, కళ్ళజోడు, నున్నగా పైకి దువ్విన జుట్టు .. యిదీ ఆయన ఆకారము చాయ తెలుపు క్రిందికి లెఖ్ఖ అతిక్రమించినట్టు అంత పెద్ద ముక్కు లేకపోతే, అతను అందగాడు క్రింద లెఖ్ఖ ముఖం అంత బాగానే



ఉన్నప్పుడు యీ ముక్కగురించి అట్టె బెంగపెట్టుకోనక్కర్లేదు నన్ను పాటపాడమన్నారు "ననుపాలింప నడచివచ్చితివా" అనే పాట పాడాను హిందీ పాటలు వినుయినా పాడమని, ఆ వచ్చినవాళ్ళలో ఒకరడిగారు అనార్కలీలో పాట పాడాను

తర్వాత ఏ సంగతీ వ్రాస్తామని వాళ్ళు వెళ్ళిపోయారు. నాన్నగారు వారితో వెళ్లారు.

వాళ్లు వెళ్లిపోయాక అద్దం ముందు నుంచుని నా అందాన్ని నేనే విమర్శ చేసుకున్నాను నా మొగము చాల అందమయినదని ఆ క్షణములో అనిపించింది.. నుదురు మీదపడ్తున్న వుంగరాల జుత్తు, విల్లువలె వున్న కనుబొమ్మలు, నల్లటికళ్లు. నా అందాన్ని నిరూపిస్తూవున్నాయి తెల్లటి పట్టుచీరమీద గులాబీరంగు జాకెట్టు, మెళ్లో మెరుస్తున్న రవ్వలహారము, గులాబీరంగు జాకెట్టుమీద నల్లటి త్రాచులాగా పడ్తున్న జడ, తల్లో మల్లెచెండు, ఆ మల్లెచెండు పైని గులాబీ రంగు నా ఆకారాన్ని చూసి ఎవరూ మెచ్చుకోకుండా వుండగలరు?

"ఏంచెప్పారు" అని అమ్మ వాళ్లని సాగనంపి వచ్చిన నాన్నగారి నడిగింది.

"తర్వాత వ్రాస్తామన్నారు నాకు మటుకు వారికి నచ్చిందనే తోస్తోంది యింతకీ అమ్మాయి అదృష్టము." అన్నారు నాన్నగారు

"మన అమ్మాయికేం? అదెప్పుడూ అదృష్టవంతురాలే" అంది అమ్మ

ఆ మాటలు నాకు నిజమనిపించాయి

ఇంట్లో అందరూ యీ వివాహము తప్పక జరుగుతుందనుకున్నారు నేను నా బొంబాయి జీవితముగురించి వూహించుకుంటున్నా ఇంతవరకు నే నూహించుకున్న వరుడు రూపూ పేరూ ఆకారము లేదు యిప్పుడు అవన్నీ ఏర్పడ్డాయి ఒకముక్క తప్పైతే, నా వూహా సుందరుడికీ యితనికీ తేడా లేదు.

బొంబాయి జీవితము, జుహూ బీచిలో షికార్లు, సినిమాలు, ఆర్టుఎగ్జిబిషన్లు, సోషలు ఏట్హోంలు, బొంబాయి ఆంధ్రమహిళా సంఘములో (అటువంటిది వుందనే భావిస్తున్నా) నేను వహించబోయే ప్రముఖ పాత్రా ఊహాచిత్రాలుగా వెలువడ్డాయి బొంబాయిలో యిస్తే ఆ యింటిలో ఏగది ఏ వుండాలో ఎల్లా అలంకరించాలో వూహించాను వూహించగలిగినశక్తి వుండాలిగాని, దానికి అంతు ఏది! సముద్రములో కెరటము తర్వాత కెరటము వస్తుంది ..అల్లాగే వూహ తర్వాతవూహ!

ఆరోజునుంచి ప్రతిరోజూ వుత్తరము కోసము ఎదురుచూసేవాళ్ళము వారములోజులయినా, పదిరోజులయినా వుత్తరము లేదు. తర్వాత మధ్యవర్తిద్వారా తెలిసింది... వాళ్ళకి మా సంబంధము నచ్చలేదని...

"అమ్మాయి చాల అదృష్టవంతురాలనుకున్నానండీ" అంది అమ్మ కొంచెము [illegible]!

"[illegible] ప్రతి సంబంధము అవుతుం [illegible]? యింతకంటే మంచిసంబంధమే

(30 వ పేజీ చూడండి)



# సిమ్లా దృశ్యాలు



ఫొటోలు: సి. సీతారాం. మద్రాసు.

సిమ్లానగరం: దూరాన
హిమాలయాలు



మంచు తెరలో సిమ్లానగరం





మాషోబ్రా లోయ

# ఊహించిన వరుడు

దానికి తాసిపుందేమో" అని నాన్నగారన్నారు

మళ్లీ నా 'సుందరుడు' ఊహామాత్రుడుగానే మిగిలిపోయాడు. ఆ 'సుందరుడి' ముక్కు వంకతీరినందుకు నవ్వుకున్నా... మళ్ళీ ఆ సుందరుడికి పూరుపేరు, ఆకారము నిర్పడలేదు.

మాకు వచ్చినసంబంధాలు వారికి నచ్చవు; వారికి నచ్చినవి మాకు నచ్చవు. నాన్నగారు, స్నేహితులు, నా వివాహముగురించి ప్రయత్నిస్తూనే వున్నారు

ఇంకొక సంబంధము వచ్చింది.. వారిదేదో పల్లెటూరట. మంచి స్థితిపరులు. ఆ గ్రామానికి మకుటములేని మహారాజులట.

వాళ్లు చూసుకోవడానికి వచ్చారు...ఆ 'వరుడి'లో పల్లెటూరి లక్షణాలు - ముఖ్యముగా వెూటతనము—కన్పించాయి

"పల్లెటూరివాడయితే, అమ్మాయి అక్కడ ఎంతో సుఖపడుతుంది. పల్లెటూళ్ళలో, స్థితిమంతుల యింటి యజమానురాలు అవడము కన్న అదృష్టమేముంది!...నాకా సంబంధము యిష్టమే" అన్నారు నాన్నగారు.

నాకు నాన్న చెప్పినమాటలు నిజమనిపించాయి. పల్లెటూళ్ళలోవున్న గౌరవమర్యాదలు పట్నములో ఎక్కడవుంటాయి. నువ్వెంత సంపాదించుకుంటున్నా నీగురించి పట్నములో నీయింటి పక్కయింటివాడికి తెలియదు. పల్లెటూరిలో ప్రతివాడిగురించి ప్రతివాడికి తెలుసు. ప్రతివాడికి వాడికి వుండవలసిన గౌరవము వుండనేవుంటుంది.

పల్లెటూరి జీవితము గురించి వూహాచిత్రాలు చిత్రించుకున్నా.. చెరువులు, బావులు, వాటినిండా కలువలు తామరలు పచ్చని పొలాలు, పంటకాలువలు, తోటలు, పనసపళ్లు, మామిడిపళ్లు, అనాసపళ్లు...గుర్తుకువచ్చేవి... తెల్లారిలేస్తే 'అమ్మగారు, అయ్యగారు' అంటూ వస్తూవుంటారు. తలుచుకుంటే నేనొక రాణీని.

కానీ, యీ సంబంధము కూడా తిరిగింది...నాలో "పట్నపు వాసనలు" ఎక్కువగా కనిపించాయిట. పల్లెటూరులో వుండగలనా, అని వదులుకున్నారుట.

నే నూహించిన వరునికి స్థిరమయిన ఆకారము నిజానము ఏర్పడ్డము లేదు.

"ఇక అమ్మాయికి పెళ్ళిజరిగే యోగ్యత లేదా" అని అమ్మ నిట్టూర్పు విడిచేది... నాన్నగారు, యింతవరకు నేను తిరస్కరించిన సంబంధాలుమాని కేలు కరచుకునేవారు.

నాకు చెప్పుకోదగ్గ విచారము లేదు ఎందుకు విచారించాలి? మంచి చెడ్డలు పూర్తిగా నాన్నగారిమీద వదిలివేశాను. ఆయన నా కన్యాయము చేయరని తెలుసు.

* * *

చివరికో సంబంధము వచ్చింది యిదీ మంచి సంబంధమే. ఆయన "గెజెటెడ్ ఆఫీసరు" యింకా చాలా వృద్ధిలోకి రాగల సూచనలు వున్నాయి.. యిప్పటికే, వీ నాలుగువందలో సంపాదించుకుంటున్నాడు

కాని ఆయన అనాకారి.. నల్లటిమనిషి, పిల్లికళ్లు దొప్పచెవులు. వీటన్నిటినీ మించి.. అతనికి ద్వితీయవివాహము. దురదృష్టవశాత్తూ మొదటిభార్య పోయింది. పాపము చిన్నవాడు.. యిప్పుయివిల్లు వుంటాయేమో. పిల్లలు లేరు.. చెప్పిన దాకా రెండో పెళ్లివాడంటే ఎవరూ నమ్మరు

మా కిష్టమయితే వారికేం అభ్యంతరము లేదుట. దాన్నిగురించి అమ్మకీ నాన్నకీ అభిప్రాయభేదాలు వచ్చాయి నాన్నగారికి ఆ సంబంధము నచ్చింది "అనాకారి అవుతే ఏం? - బాగా సంపాదించుకుంటున్నాడు; వృద్ధిలోకి వస్తాడు. అమ్మాయి సుఖపడుతుంది," అని నాన్నగారంటారు.

"అతని ప్రక్క మన అమ్మాయి నిలబడితే చూడడానికి చాలా కష్టముగా వుంటుంది. అమ్మాయికేం తగడ"ని అమ్మ అంటుంది

"నువ్వూ నేను వాదులాడుకోవడం దేనికి? అమ్మాయి యుక్తాయుక్తాలు తెలియని పిల్లకాదు. అమ్మాయి నేకనుక్కుందాము... దాని కిష్టము లేకపోతే వదులుకుందా"మని నాన్నగారన్నారు.

నేను యిన్నాళ్లుగా వూహించిన సుందరుడికీ యీయనకీ ఎక్కడా పోలిక లేదు. నే నెప్పుడూ నల్లటివాళ్లని, అనాకారులని వూహించలేదు. కానీ యీ సంబంధానికి వప్పుకుంటే నేను సుఖపడగలనని నాన్న చెప్పిన మాటలు నిజము భార్యాభర్తలలో ఎవరు ఎక్కువ అందగాళ్లయితే వారి అధికారము చెల్లుతుందేమో అనుకుంటాను. అయినా ఆయన మంచివాడు, మంచి పదవిలోను వున్నాడు కేవలం అందగాడు కాదన్న ఆ ఒక్క అంశంకోసం ఆయన్ని నిరసించడము సబబు అనిపించలేదు. ఆ క్షణంలో నాకు అనాకారులమీద చెప్పలేనంత సానుభూతి కలిగింది.

అసలు ఆఫీసర్లు సాధారణముగా అనాకారులు; వారి భార్యలు అందగత్తెలు అని అంటూవుంటారు యీ విషయము ఏ కలెక్టరుగారి భార్యనిచూసినా, డి యం. ఓ గారి భార్యనిచూసినా తెలిసిపోతుంది.

నాన్నగారు నన్నడగ్గానే 'మీ యిష్టమే నా యిష్ట'మని జవాబు చెప్పాను.

నేను వ్యక్తిత్వము లేనిదాన్ననీ, ఆశయాలు లేనిదానిననీ అనుకుంటారు సంఘర్షణలో నిలువలేని పిరికిదాన్ని అంటారు. కానీ నాకు అపజయము, అసంతృప్తిఅనేవి లేవు. అందుకనే నా జీవితము ఎప్పుడూ సుఖముగానే వుంటోంది ★




భానుమూర్తిపంతులు: పద్మ తండ్రి.
మధుసూదనరావు: కాలేజీ లెక్చరర్, పద్మ పినతండ్రి.
గోపీనాథ్: కాలేజీ ప్రొఫెసర్.
ప్రభాకర్: యువకుడు, దేశాభిమాని.
రజాక్, చౌదరి, గోపాలరావు } కాలేజీ విద్యార్థులు.
పద్మ: యం.యస్‌సి. పాసైనయువతి.
సరస్వతమ్మ: పద్మతల్లి.
విశ్వేశ్వరమ్మ: ప్రభాకర్ పినతల్లి.
రాధ, ఉష } విశ్వేశ్వరమ్మ కుమార్తెలు.
జానకి: గోపీనాథ్ భార్య.
లీల: కాలేజీ విద్యార్థిని.

రంగము 1.

[ప్రదేశము - భానుమూర్తి పంతులుగారి గృహము. సమయం - రాత్రి 9 గంటలు. భానుమూర్తిగారు రాత్రిభోజనం చేసి ఇంటి ముందు ఆవరణలో పడకకుర్చీలో విశ్రమించి ఉంటారు. పద్మకూడ భోజనం చేసి తండ్రిగారివద్దకు వస్తూఉంటుంది. పద్మకు ఇరవైఏళ్ళుంటాయి పలుచని చెక్కిళ్ళు విశాలమైన నేత్రాలు గలిగి సుప్రసన్నమైన ఆమె ఆననం సౌందర్యాన్ని సౌకుమార్యాన్ని సౌమనస్యాన్ని వైదుష్యాన్ని వెల్లడిస్తూ ఉంటుంది లేతరంగు నేతచీర తెల్లని జాకెట్టు ధరించిఉంటుంది చేతులకు రెండు జతల బంగారు గాజులు ఒకజత మట్టిగాజులు ఉంటాయి. మెడలో ఒక పేట గొలుసు ఉంటుంది ముఖమున పెట్టుకున్న చిన్న కుంకుమబొట్టు, ఆమె ముఖ సౌందర్యాన్ని ఇనుమడింపజేస్తూ ఉంటుంది ]

భాను: ఏమమ్మా! ఇవ్వాళ లేడీస్ క్లబ్బులో నీ సన్మానోత్సవం చాలా అట్టహాసంగా జరిగినట్టున్నదే?

పద్మ: ఆ. వద్దన్నకొద్దీ రాణి వినకుండా ఆటలు పాటలు డాన్సులు టీపార్టీలు పెట్టి నానా హంగామాచేసింది నాన్నగారూ!

భా: ఏదో నీమీదఉండే ప్రేమాతిశయం కొద్దీ చేశారుకాబోలు. చిన్నతనపు సరదా తప్పేమున్నదిలే

ప: అయితేమాత్రం ఇంత అట్టహాసమెందుకూ?

భా: దానికేమిలే. అది సరేకాని నీవు కాలేజీలో చేరవిషయమై ప్రిన్సిపాలుగారితో సాయంత్రం మాట్లాడి వచ్చాను. ఆయన ఇదివరకే ఒక అమ్మాయి చేరి ఉన్నదనీ, మీ అమ్మాయినిగూడా తప్పకుండా

కనుపర్తి
వరలక్ష్మమ్మ

చేర్పండనీ, ఈ సంవత్సరం గరల్సుకు రీసర్చికి ప్రత్యేకం ఏర్పాటులుగూడా చేశామనీ ఎంతో ప్రోత్సాహంగా చెప్పారు

ప: ఏమిచెప్పినా, ఏమోనండీ నాన్నగారూ!

భా: ఏమమ్మా ఎందుకూ సంకోచం?

ప: మగవాళ్ల కాలేజీకి వెళ్లడం చాలా కష్టమండీ! ఆ స్టూడెంట్సు చాలా విచ్చలవిడిగా ఉంటారు. వాళ్లతో కలిసి వ్యవహరించడం కష్టమని భయంగా ఉన్నది.

[ఇంతలో పద్మ తల్లి సరస్వతమ్మ లోపలి నుండి తటాలున వచ్చి]

స: నిజంగా అమ్మాయి చెప్పినట్టు మగపిల్లలతో కలిసి వ్యవహరించడం ఎంతైనా కష్టమే. అయినా ఈ ఇబ్బంది లేకుండానే మన అమ్మాయి చదువంతా అయిపోయింది గదా, ఇప్పుడు గీ గీ అంటూ మగవాళ్ళ [illegible] చెప్పండీ? అసలే ఏమనుకుంటే ఏమున్నదో? చదువుకునే కుర్రవాళ్లంటే ఎటువంటివారో తెలుసునా వట్టి ...

భా. ఇక నీ ఉపన్యాసం కట్టిపెట్టు. ఊరికే పిల్లను అడలగొట్టుతున్నావేం? మన పిల్లేనా? కాలేజీలో ఎంతమంది ఆడపిల్లలు చదువుకోడం లేదు. అన్నిటికీ ఆడపిల్లలకు ప్రత్యేకం కాలేజీలు రమ్మంటే ఎట్లా వస్తాయి? శేషగిరి రావుగారి అమ్మాయి చూచావా? ఒంటరిగా బెనారసులో ఉండి చదువుకొని వచ్చింది. ఇప్పుడు మళ్ళీ వార్ధా వెళ్ళబోతున్నదట. గాంధీగారి యీ నూతన విద్యాప్రణాళిక గూడా అవగాహన చేసుకున్నాక అప్పుడు ఉద్యోగం సంగతి ఆలోచిస్తారుట. బాలికలకు అటువంటి ధైర్యసాహసాలుండాలె మగపిల్లలు మగపిల్లలు అని భయపడుతూ ఉంటే ఎప్పుడూ భయమే. అయితే మనత్రోవను మనం వెళ్ళి మన పనేదో మనం చూచుకొనివస్తే ఎవరూ యేమీ చేయరు.

ప: ఆడపిల్లలంటే వాళ్లకెంతో చులకన నాన్నగారు కాలేజీనుంచి ఊరక త్రోవన వస్తూఉంటేనే ఏవేవో మాటలు ఆలోచన లేకుండా అనివేస్తూ ఉంటారు. అవి వింటూఉంటే మనస్సుకెంతో బాధగా ఉంటుంది. అనాలోచితమైన తమ మాటల వల్లను, ప్రవర్తనవల్లను బాలికల హృదయాలు ఎంత నొవ్వచేస్తున్నారో వాళ్లకు తెలియదు.

భా: ఈమధ్య నీకొక కాలిజోడు తెచ్చియిస్తే అజోడు ఒరుసుకుపోయి చాలా బాధపెట్టిందన్నావు జ్ఞాపకం ఉన్నదా?

ప: అవును కొత్తలో దానితో చాలా బాధపడ్డాను.

భా: మరి జోడు వేసుకోడం మానావా?

ప: మానలేదుగాని తొడుగుతూఉంటే అదే అలవాటై పోతుందని వేసుకుంటూ వచ్చాను.

భా: (నవ్వుతూ) అంతే మరి ఇప్పుడు నీకూ ఆ జోడూ రాజీపడ్డారా లేదా?

ప: అట్లాగే విద్యార్థులతోటి చనువంటారా?

భా: అంతేనమ్మా! ఆరంభం ఎంత కష్టమనిపించిందీ అభ్యాసం చేత సరళమైపోతుంది చూచావో లేదో, అయినా ఒకరో ఇద్దరో అల్లరి కుర్రవాళ్ళున్నారని విద్యార్థులందర్నీ అనడం భావ్యం గాదు. వారిలో సహృదయులైన వారూ బాలికలను సోదరీభావంతో చూచేవారూ లేకపోలేదు నా అభిప్రాయమైతే చెడ్డవాళ్లకంటె మంచివాళ్లే ఎక్కువని. కాని పచ్చకర్పూర తాంబూలం వేసుకున్నవారి సువాసనకంటె వెల్లుల్లిపాయ తిన్న

లాట పడతారు కాని పెండ్లిమాట ఆలోచించరు

వి: పెండ్లికేమిలెండి చదువు పూర్తైతే ఎప్పుడు పడితే అప్పుడే పెండ్లిచేయవచ్చు.

స: పెండ్లి అంత సులభంగా ఉన్నట్టు చెప్పుతున్నారే ఎప్పుడు పడితే అప్పుడే చేయవచ్చుననీ? ఇదేమి పిల్ల గుణ రూప విద్యా సాంప్రదాయాలు చూచి పెండ్లి చేసుకొనే రోజులా ఏమన్నానా? అన్నిటికీ డబ్బే కొలికిపూసయిపోయె సంబంధానికనిపోతే అయిదు వేలిస్తావా పది వేలిస్తావా అని బేరమాడడం. తప్పితే మరొక యోచన లేదాయె. ఎంత చదివించినా ఏమి ప్రయోజనమున్నది చెప్పండి? ఇటు చదువుకు బోలెడు సొమ్ము పోస్తిమి! అటు పెండ్లికి బోలెడు డబ్బు పోయవలసివచ్చె చదువు చెప్పించిమాత్రం ఏమి లాభం?

వి: అవును మన సంఘపరిస్థితు లట్లాగే ఉన్నవి. మన యువకులు ఉన్నతవిద్య నభ్యసించినా హృదయసంస్కారం కలగడంలేదు. ద్రవ్యవాంఛ నశించడంలేదు. వివాహం ద్రవ్యసంపాదనకు ఒక సాధనగా ఏర్పాటు చేసుకుంటున్నారు తలిదండ్రుల మనస్తత్వాలు గూడా వీటికి అనుగుణ్యంగా ఉంటున్నాయి. అసలు యువజనులు వరశుల్క స్వీకారంలో ఉన్న నైచ్యాన్ని గ్రహించి హృదయపూర్వకంగా నిరాకరిస్తే వరకట్నాలు మనదేశంలో ఇంత వ్యాప్తిగా ఉండేవేనా? ఈ కాలపు విద్యార్థులు ఎన్ని విద్యార్థి కాంగ్రెసులైనా నడుపుతారుగాని ఈ వరకట్నాల విషయమై ఒక్క తీర్మానమైనా చేసి ఆదర్శప్రాయంగా వర్తించలేకుండా వున్నారు. ఇందుకు మన మహిళాసంఘాలే బాగా కృషి చేయాలి.

స: ఎంతచేసినా ఇంతేలెండి. వివాహాల్లో వచ్చే కట్నాల లాంఛనాల పేచీల్లో ముక్కాలు మువ్వీసం పేచీలకు మన మహిళామణులే బాధ్యులు కుమార్తె పెండ్లిలో కట్నం ఇవ్వలేక గిజగిజలాడినవాళ్లు కొడుకు పెండ్లి వచ్చేటప్పటికి రక్తపుబొట్టు పిండినట్టు డబ్బు పిండుకోడానికి తయారవుతుంటే కట్నాలు ఎట్లాపోతాయి చెప్పండి? ఎన్ని తీర్మానాలన్నా చేయండి, తీర్థానికి తీర్థమూ ప్రసాదానికి ప్రసాదమే మనసుల్లో లేనిది మహాసభల్లో తీర్మానిస్తే అవుతుందండీ!

వి: నిజమే మీరన్నమాట, కట్నాలు ఆడపిల్లల పాలిటికి పరమశత్రువులై కూర్చున్నాయి. ఈ పాపిష్టి కట్నాల మూలంగా చక్కని విద్య ఉండి రూపం ఉండి యోగ్యత ఉండి వంశగౌరవం ఉండి తలిదండ్రులు డబ్బు ఇచ్చుకోలేని కారణంగా పాపం ఎంత మంది కన్యలు ఇళ్లల్లో మ్రగ్గిపోతున్నారు! ఆ బిడ్డలను చూచుకొని తలిదండ్రు లెంత మంది కుమిలిపోతున్నారు! హృదయవిదారకమైన సంక్షోభం యిది! నిజంగా ఒక్కొక్క ఇంటి పరిస్థితి చూస్తే ఈ దురాచారం పోవడానికి సంఘంలో ఏదో పెద్ద విప్లవమే రావాలని ఉన్నదనిపిస్తున్నది.

స: కానీయండి మీవంటివారు కృషి చేస్తే ఏనాటికైనా అటువంటి మార్పు వస్తుందేమో! అన్నట్టు మన అమ్మాయి రాధ వార్ధా వెళ్లుతుందని విన్నాను నిజమేనా?

వి: అవునండీ రేపురాత్రి వెళ్ళవలె ననుకొంటున్నది

స: అమ్మాయి బెనారసులో చదువంతా పూర్తిచేసుకొనే వచ్చిందిగా మళ్ళీ వార్ధా ఎందుకూ.

వి: అమ్మాయికి ఉద్యోగం చేయడం ఇష్టంలేదుట.

స: చేయక ఏమిచేస్తుంది

వి: ఏదో దేశసేవ, సంఘసేవ చేస్తానంటుంది పోనీలెండి ఉద్యోగం చేసి మాత్రం ఆమె ఎవరిని పోషించాలె. ఎంతో చదువుకున్నవాడు, మన పిల్ల ఎంతో సుఖపడుతుందని యిస్తే ఏడాది తిరగకముందే ఇట్లా అయిందిగదా. ఆమెకేదో వ్యాసంగం ఉంటే చాలునని మా తలంపు. వార్ధాలో కొన్నాళ్లుండి అక్కడ మహిళాశిక్షణ శిబిరంలో తరిబీతు పొందివచ్చి ఏదో చేస్తానంటుంది ఇందులో మా ప్రభాకరం ప్రోత్సాహం కొంత

స. ప్రభాకరం ఎవరండీ?

వి: మా అక్కగారి కొమారుడండీ! అతను ఆనర్సు ఫస్టున ప్యాసై వార్ధాలో ఒక ఏడాది ట్రైనింగై వచ్చాడు. ఇప్పుడు ఏదో గ్రామంలో ఉండి గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమంలో పనిచేస్తున్నాడు. మా ప్రభాకరం వెళ్ళిన తరువాత ఆ గ్రామం ఎన్నివిధాలనో బాగుపడ్డది. ఆ గ్రామవాసులకు మా ప్రభాకరమంటే అమిత ప్రేమ గౌరవమూ.

స: ఇదేమిటోనండీ! ఈ పిల్లలకు ఇదొకటే పట్టుకున్నది మా పద్మకూడా అంతే మాట మాట్లాడితే దేశసేవ దేశసేవ అంటుంది. కాని తండ్రిగారు నీ చదువు పూర్తికానీయమ్మా అని ఆపుతున్నారు ఈమధ్య ఖద్దరు తప్ప కట్టనంటే మొన్ననే రెండు ఖద్దరు చీరెలు కొనుక్కొచ్చారు. సరే వదినగారూ మాటలసందడిలో అసలు విషయం అడగటం మఱచిపోయినా ఏమి పనిమీద వచ్చారు?

వి: మన మహిళా సమాజంలో గృహపరిశ్రమల శాఖను పెట్టి పేదస్త్రీలకు చేతిపనులు నేర్పించి స్వతంత్రంగా జీవించే మార్గ చూపించవలె ననుకుంటున్నాము. ఏపని తలపెట్టినా డబ్బు ముఖ్యం దానికి మీవంటి గృహిణులసహాయం ముఖ్యం మిమ్ములను శ్రమపెట్టకుండా ఏమీ చేయలేముగా!

స: దానికేమిలెండి మాకు చేయడం చేతకాకపోయినా చేస్తున్నవారికి సహాయం చేయకపోతే మేముమాత్రం తరించేదెట్లా చెప్పండి. (అని లోపలికిపోయి పదిరూపాయలనోటు తెచ్చి ఇస్తుంది)

వి: (నోటు తీసుకొని పర్సులో పెట్టుకుంటూ) మీ దెప్పుడూ పెద్దపద్దే రేపు ఒకటోతారీఖున క్లాసు ప్రారంభిస్తాము ఆనాడు మీరు, పద్మ తప్పకుండా రావాలె.

స: వీలుంటే వస్తాను.

వి: వీలుంటే కాదు వీలు చేసుకొని రావాలె. మనస్త్రీలకిదొక అభ్యాసమైపోయింది. ఎవరోవచ్చి చందా అడగ్గానే యివ్వడంతో తమ బాధ్యత తీరిపోయిందనుకుంటారు మీరు స్వయంగా వచ్చి మేముచేసేపనులను కండ్లారా చూడటమూ, యథాశక్తిగా ఆ పనులకు తోడ్పడమూ విరాళాలు ఇచ్చేదానికంటే ముఖ్యము. కనుక తాము తప్పక రావాలె సుమండీ! నమస్కారం, వెళ్ళివస్తా (అని వెళ్లడానికి లేస్తుంది)

స: మంచిది. సెలవు.

(తెర)

## రంగము 3.

[ప్రదేశము భానుమూర్తి పంతులుగారి గృహము సమయము - సాయంత్రము అయిదుగంటలు భానుమూర్తిగారు వీధి వైపు వరండాలో పడకకుర్చీలో విశ్రమించి ఉంటారు. పక్కన ఒక పేముకుర్చీ ఉంటుంది. పద్మ అంచులద్దిన ఖద్దరు చీరె ఖద్దరు రెవిక ధరించి ఆకు చెప్పులు తొడుక్కొని చేతిలో ఒక పుస్తకం పట్టుకొని నిరాడంబరంగా కాలేజీనుంచి వస్తుంది.]

భా: (నెమ్మదిగా ప్రసన్నవదనంతో) ఏమమ్మా! కాలేజీ ఎట్లా ఉన్నది?

ప: నూత్న ప్రపంచంగా ఉన్నది. (అంటూ పేముకుర్చీలో కూర్చుంటుంది)

భా: ఏమిటా నూత్నత?

ప: ఎటుచూచినా నాపైపే దృష్టులు పారిస్తున్న విద్యార్థుల నేత్రాలు.

భా: ఇవ్వాళేగా నీవు కాలేజీకి వెళ్లింది!

ప: నేనొక వింత వస్తువుగా ఉన్నట్టున్నాను వారికి.

భా. అవునమ్మా! రెండురోజులు వాళ్ళూ వింతగా చూస్తారు. నీవు బెరుకుగా ఉంటావు. తరువాత ఉభయులకు పరిపాటైపోతుంది. మన దేశంలో బాల బాలికలు కలిసి

# పద్మ

చదువుకోనే అభ్యాసం లేనందువల్ల వచ్చిన చిక్కది

ప: కాదు. కాదు. ఆడపిల్లలకంటే తామధికులమనే భావం మగపిల్లల కున్నందువల్ల వచ్చిన చిక్కు.

భా: అదీ కొంతవరకు నిజమే మీ క్లాసులో లీల అనే ఒక అమ్మాయిగూడా ఉన్నదిగా.

ప ఉన్నది

భా. సరే ఒక అమ్మాయి తోడుగూడా ఉన్నది గనుక ఒకరికొకరు తోడుగా ఉండవచ్చును

ప: కాని ఆ అమ్మాయి అంత సరళమైనదిగా కనిపించలేదు. కొంచెం ఈర్ష్యాళువుగా కనిపిస్తున్నది. మధ్యాహ్నం లేబరేటరీలో ప్రొఫెసర్ గారు అడిగినదానికి నేను సరైన సమాధానం చెప్పేటప్పటికి ఆమె ముఖం చిట్లించుకున్నది

భా. ప్రొఫెసరుగారు ఆమెను అడగలేదా?

ప మొదట ఆమెనే అడిగారు ఆమె చెప్పలేకపోయింది. తరువాతనే నన్ను అడిగారు.

భా: పోనీలే. ఆమెకు తెలియలేదేమో! ఏమయినా నీవు మాత్రం ఆ అమ్మాయితో ఎప్పుడూ అనుకూలంగానే ఉండు ఆమె ఏదైనా అడిగితే తప్పకుండా తెలియచెప్పు

ప నాకు అటువంటి అసూయాపరులతో మాట్లాడటానికి కష్టంగా ఉంటుంది పైగా ఆమె ఆ మొగపిల్లలవంక చూస్తూ ఇకిలిస్తూ ఉంటుంది నాకా చేష్టలు చూస్తే అసహ్యం.

భా: నిజమే అసహ్యమే. అయితే ఏమి చేస్తాము లోకము అనేకరీతులు. మానవులందరు ఒకేరీతిగా ఉంటే ఇంత గందరగోళమే లేకపోవును తేనెను సేకరింపదలచినవాడు తేనెటీగలు ఎంత కుట్టుతున్నా, ఎంత రొదచేస్తున్నా తనపనిని మాననట్లే నీవుగూడా నిలక్ష్యార్థమైన విద్యను సాధించేదాకా వివిధప్రకృతులతో ఇట్లాగే శ్రమపడాలి.

ప: నాన్నా! మీవన్నీ నీతిసూక్తులు, ధర్మపన్నాలు ఇవి ఆలోచనాసీమలో ఉన్నంత సొంపుగా ఆచరణాపథంలో కాన్పించవు

భా: అవునమ్మా! అవును కాని సంకల్పదార్ఢ్యాన్నిబట్టే క్రియాపర్యవసానం ఉంటుంది

ప. ఒకప్పుడు ఉత్కృష్ట సంకల్పాలు గూడా విఫలమై పోవడం లేదండీ!

భా: సత్సంకల్పాని కెప్పుడూ అవరోధాలేగాని అపజయాలుండవని నా తాత్పర్యం.

ప: నాన్నగారు కృతయుగ ధర్మాలు లక్ష్యంలో పెట్టుకొని మాట్లాడుతున్నారు. కాని ఇది కలియుగం. ఇప్పుడు సత్సంకల్పాలకే విఘ్నాలెక్కువ

భా అయితే కావచ్చును భగవంతుని ఎదురొడ్డలేముగదా ఒకప్పుడు మన యత్నాలు న్యాయబద్ధమైగూడా విఫలమైతే కావచ్చును కాని అందుకు భగవంతుడే బాధ్యుడు. అయితే మన లక్ష్యం మాత్రం ఎల్లప్పుడు ధర్మోన్నతమైనదిగానే ఉండాలె. సత్యాన్ని ధర్మాన్ని జీవితలక్ష్యంగా పెట్టుకున్నవారి జీవితం ఎటువంటి ఒడిదుడుకుల్లోనూ సుగమంగా సాగిపోతుంది అటువంటి లక్ష్యం లేకపోతే బ్రతుకు దోవా డొంకా ఉండదు చుక్కాని లేని పడవలాగా కొట్టుకలాడిపోతుంది.

ప. నాన్నా లోపలికి వెళ్ళివస్తా.

భా: వెళ్ళిరా అమ్మా! కాలేజీనుండి వచ్చినదానిని వచ్చినట్లే మాట్లాడుతున్నావు (తెర)

## రంగము 4.

[ప్రదేశం కాలేజీ హాస్టలులో ఒక గది సమయం సాయంత్రం ఆరు

లీల, రజాక్, గోపాల్, చౌదరి, ఒక గుండ్రని బల్లచుట్టూ నలుగురూ నాల్గు కుర్చీలలో కూర్చుండి ఉంటారు.]

చౌ గోపాల్! పద్మ చాల తెలివిగల పిల్లలా గున్నదే?

గో ఎట్లా కనిపెట్టావోయ్ జ్యోతిష్కుడా

చౌ ఇవ్వాళ లేబరేటరీలో ఆమె చేసిన ఎక్స్పరిమెంటు చూచి ప్రొఫెసర్ గోపీనాథ్ బలే మెచ్చుకున్నాడు

గో: అవును ఆమె యూనివర్సిటీ ఫస్టుటగా

లీ. ఊఁ ఫస్టుగిస్టులు ఏమీ అక్కర్లే. అభిమానమున్నవారు ఏమిచేసినా బాగానే ఉంటుంది

ర. మన ప్రొఫెసర్కి పద్మమీద అభిమానమంటావా లీలా

లీ. ఆఁ మరేమనుకున్నారు? పెండ్లాడబోయే పిల్లమీద ఆమాత్రమైనా అభిమానం [illegible]!

చౌ: అదేమిటి లీలా! మన ప్రొఫెసర్ గారు పద్మను పెండ్లిచేసుకుంటారా?

ర హాఁ హాఁ (అని నవ్వుతూ) బొత్తిగా తలలక్కీ మోకాళ్ళకీ ముడిపెట్టడంలో లీలకి బలే తెలివి ఉంది.

చౌ: లీలవన్నీ అబద్ధాలు, ప్రొఫెసర్ గారికి చిన్ననాడే ఇంగ్లండుకు పోకముందే పెండ్లయింది.

లీ. ఆయనకు పెండ్లికాలేదని ఎవరూ చెప్పలేదండీ!

ర. అయితే ఏమి చెప్పతున్నారండీ!

లీ ఆయనకు భార్యంటే బొత్తిగా యిష్టంలేదట ఆమె పల్లెటూరి మనిషట. ఇంగ్లీషు రాదట, ఫాషన్లు తెలియవట, ఫారెన్ తిరిగివచ్చినవాడుగనుక మంచి ఎడ్యుకేటెడ్ వైఫ్ కావాలని ఆయన కోరికట

గో: అయితే భార్య ఉండగానే మళ్ళీ పెండ్లి చేసుకుంటాడన్నమాట.

ర. చేసుకుంటేమాత్రం పద్మనే చేసుకుంటాడనీ అందుకే అభిమానం చూపుతున్నాడనీ ఏమి దాఖలా

లీ దాఖలాలు చూచే అంటున్నాను

చౌ ఆ దాఖలాలేమిటో చెప్పు చూతాం.

లీ. మన కాలేజీ హిస్టరీ లెక్చరర్ మధుసూదనరావుగారు ఆమెకు దగ్గరబంధువు ఆయన ద్వారా జరుగుతున్నాయి రాయబారాలు

చౌ ఓయ్ బాబో లీలా! అప్పుడే ఎంత ఇన్ఫర్మేషన్ సంపాదించావు

లీ నేను సంపాదించే దేమిటి, ప్రతివాళ్లూ చెప్పుకుంటూ ఉంటే

గో: అయితే నిజమే?

లీ వాళ్ళ ఇంటిదగ్గర ఉన్న నా ఫ్రెండ్ ఒకామె నమ్మకంగా చెప్పింది

ర: అయితే బలేపట్టే దొరికిందిరా. ఇన్నాళ్ళనుంచి పద్మ మంచిపిల్ల అనుకుంటున్నాం ఇక ఇద్దర్నీ వదిలిపెట్టగూడదు

గో. వదలకేంజేసావోయ్.

ర: గోలచేసానోయ్

చౌ: ఎట్లా చేస్తావోయ్.

ర: ఎట్లా చేసేది రేపు కాలేజీలో నే చూస్తావోయ్

గో: మాకు కాస్త చెప్పరాదోయ్

ర. అరె! ఆకాస్తా ముందుగాచెప్తే దాని మజా పోదటోయ్.

చౌ ఈ నవాబు బిడ్డవన్నీ వట్టి బడాయిలు.

గో: అరే! ఒకవేళ ప్రొఫెసర్ గారు ఆ అమ్మాయిని పెండ్లి చేసుకుంటారే అను

కుంటాం. అయితేమాత్రం మన సౌఖ్యాని పోయిందిరా.

ర: అరే! భార్యఉండగా మళ్ళీ పెండ్లేమిటి?

చా: సాహేబుగారూ! ఈ విషయంలో ఆక్షేపించవలసిందే?

ర: హౌనోయ్! అది మా కులానికే లాయఖ్ ఖుం చేసుకుంటాం ఇద్దరూ, ముగ్గురూ, ఓ నాటొక్కమందిని చేసుకుంటాం మీ హిందువు లిట్లా చేయవచ్చునటే మీ దేశ్ము మీ రాముడు ఏకపత్నీవ్రతు డని గొప్పలు చెప్తారే?

గో. బహు భార్యాత్వం మా లోనూ ఉన్నది

చా. రాముడితండ్రి దశరథ మహారాజుకు మున్నూటరవైమంది భార్యలు బహు భార్యాత్వం మాకు లేకపోవ డేమిటి?

లీ: ఉంటే ఇలా పదిమందిని చేసుకోం డయ్యా! వాళ్ళన్నా గడించి పెట్టుతారు

ర: ఆడది మాకు గడించి పెట్టడ మేమిటి నామర్దా.

లీ: మరి బహు భార్యాత్వం మాకున్న దంటే మాకున్న దంటే అన్నాను

గో: నీవుమాత్రం ఏకపత్నీవ్రతుని చేసుకోవాలె

లీ: మా పెండ్లిమాట మీ కెందుకూ?

ర. మా పెళ్ళిళ్ళమాట నీ కెందుకూ?

గో: పెండ్లి చేసుకో దేమంటే!

లీ: ఎట్లాగన్నా అనుకోండి నేను పోతున్నా.

ముగ్గురు మేమూ వస్తున్నాం

(తెర)

### రంగము 5.

[ప్రదేశం—భానుమూర్తి పంతులుగారి గృహం సమయం—సాయంత్రం ఏడున్నర. పద్మ ఖిన్నవదనంతో టేబుల్ ముందు కుర్చీలో కూర్చుండి ఉంటుంది భానుమూర్తి పంతులుగారు సాయంత్రం షికారుకు పోయివస్తూ పద్మను చూచి విస్తుపోయి నిలబడి]

భా: ఏమిటమ్మా! అంత విచారంగా ఉన్నావు?

ప: ఏమిటో! నాన్నగారు! ఆ కాలేజీలో ఎందుకు చేరానా అని చాలా దుఃఖంగా ఉన్నది వెళ్ళ రిసర్చి లేకపోతే మానెగాని కాలేజీలో చేరడం తప్పేనండీ! (అని కళ్ళనీళ్ళు తుడుచుకుంటుంది వణుకు గొంతుతో)

భా. (ఆదుర్దాతో) ఎందుకమ్మా అట్లా అంటున్నావు? ఏం జరిగింది తల్లీ (అంటూ తల నిమురుతూ పక్క కుర్చీలో కూర్చుంటారు)

ప: నిన్న లేబరేటరీలో నేను ఏదో ఎక్స్పెరిమెంటు చేస్తే ప్రొఫెసర్ గోపినాథ్ 'గుడ్' అన్నారు ఆయన ఆమాట నామీద ఏదో అభిమానంతో అన్నారని ఊహించి, యీరోజున నేను కాలేజీకి వెళ్ళేటప్పటికి నా బల్ల మీదను కుర్చీమీదను, బోర్డులమీదను చుట్టుప్రక్కల గోడలు కిటికీలు తలుపులు వగైరా అన్నిటి మీదా 'గోపినాథ్ పద్మ' 'గోపినాథ్ పద్మ' అని

# నారీ మాహాత్మ్యము

మనపూర్వ సాహిత్యంలో విశాల హృదయులు, ఆదర్శవాదులు అయిన మహాకవులు స్త్రీకి విశిష్టమైన గౌరవస్థానం ఇచ్చారు. వారు స్త్రీని ఒక పవిత్ర మూర్తిగా దర్శించి ఆమె పావిత్ర్యాన్ని గానం చేశారు.

ఉత్తరరామచరిత్రంలో భవభూతి శ్రీరాముని చేత ఇలా అనిపిస్తాడు:

ఇయం గేహే లక్ష్మీరియ మమృతవర్తిర్నయనయో
రసావస్యా స్పర్శో వపుషి బహులశ్చందనరసః
అయం బాహుః కంఠే శిశిరమసృణో మౌక్తికసరః
కిమస్యా న ప్రేయో యది పరమసహ్యస్తు విరహః

"ఈమె (సీత) గృహమునకు లక్ష్మి. నయనములకు అమృతవర్తి. ఈమె స్పర్శ శరీరమునకు చందన రసము. ఈమె బాహువు కంఠమునందు శిశిర మసృణమైన మౌక్తికసరము. ఈమెలో ప్రియముగాని దేమున్నది, ఒక్క విరహమే దుస్సహముగాని?"

మహాభారతం అశ్వమేధపర్వ చతుర్థాశ్వాసములో సక్తుప్రస్థుడనే బ్రాహ్మణుడు భార్యతో ఇలా అంటాడు:

స్త్రీ సంతోషించు తెరం
గానపడని మనసు గలుగునట్టి యధముడే
చోపడిగను, జని యచ్చో
గాసింబడు జనునిభటులు గారియవెట్టన్.

# ★ పద్మ ★

కందులేకుండా వ్రాసిపెట్టారు. అవి చూచే టప్పటికి నాకు పుట్టెడు దుఃఖం వచ్చింది (దుఃఖ గాద్గదికమైన కంఠంతో) తక్షణమే కాలేజీనుంచి వచ్చివేద్దామనుకున్నాను కాని అట్లావస్తే ఆ కాంసెంసంచుకు మరీ చులకనవుతానని ఎట్లాగో తలవంచుకొని అట్లాగే కూర్చున్నాను.

భా. ఈ సంగతి ప్రిన్సిపాలుతో గాని ప్రొఫెసర్లతో గాని చెప్పావా?

ప. ఎవరితోనూ చెప్పలేదు వానిని చూపినట్లే నటించి నాపని నేను చూచు కొని దక్కావచ్చాను

భా. మంచిపని చేశావు ఇటువంటి వానిని పెద్దగా గమనించి వారితో వీరితో చెప్పడంవల్ల వానికి అధిక ప్రాముఖ్యత [illegible] గూడా చూడడము, ఇతరుల దృష్టిలో మనం తేలిక కావడమూ సంభవిస్తుంది ఇటువంటి సందర్భములో మౌనమే పక్కాపని నీవు ఆ వ్రాతలు చూచి ఉడికిలి గందరగోళం పడినట్లయితే వాళ్లు తప్పకుండా గేలి చేసేవాళ్లే!

ప అదే నాకు భయం వేసింది

భా దేనికైనా నిదానం ఎంతో మంచిది ఇంతకు మనదేశపు విద్యార్థులకు ఒక దురభిప్రాయం ఉన్నది ఆడపిల్లలు తమకంటె తక్కువవారనీ ప్రతిక్రియా సామర్థ్య విరహితులనీ, వాళ్లను ఎంత హింసించినా ఫర్వాలేదనీ వారి అభిప్రాయం

ప బాలికలను గౌరవభావంతో చూడడమూ, వాళ్లతో కలిసి మెలసి సోదరీ భావంతో వ్యవహరించడమూ, వాళ్లు తమ కంటె అధికులుగా ఉంటే సమానంతో సంతోషించడము మనదేశపు స్టూడెంట్సు ఎరుగరు. వాళ్లు మా పాలిటికి సింహశార్దూలములవంటి భీకరమృగాలు, మేము చీమ దోమలవంటి అల్పజీవులము ఇటువంటి అభిప్రాయం వాళ్ళకైనా ఉచితమూ గౌరవప్రదమూ కాదనుకుంటాను. ఈ దురభిప్రాయం విద్యార్థి సోదరులలో ఎట్లా పోతుందో!

భా. నీవంటి ఉత్తమ విద్యార్థినులు కళాశాలల్లో చేరి వాళ్లు చేసే అలజడులకు జడియకుండా ఓర్పుతో నేర్పుతో చదువుకుంటూ ఉంటేనే.

ప: ఏమి చదువుకుంటామో! (నిట్టూర్పు విడుస్తుంది)

భా. అమ్మాయీ! "నీకంటె నాకొ విద్యార్థులను తెలుసుకుంటేనే జాలి వేస్తున్నది మన బంగారం మంచిదైతే కంసాలి ఏమి చేయలేడుగదా వాళ్లు ఎందుకింత చెడ్డవాళ్లనిపించుకోవాలి చెప్పు? విద్యార్థులు ఒక్క ధర్మం గుర్తించాలి. తమ సోదరికి ఏ అవమానం జరిగితే తాము సహింపజాలరో ఆ అవమానం ఇంకో సోదరికి తాము చేయరాదు

ప ఇంత ధర్మసూక్ష్మం వారికి కావాలెనా?

భా: బాలికలుగూడా జాగ్రత్తగా మసులుకోవాలె

ప: అవును నాన్నగారూ తప్పు బాలికల్లోనూ ఉంటుంది లీల ఉన్నదే, ఆ పిల్లవల్లకొంటె ఈరోజున ఇట్లా వ్రాయడానికి ఆ అమ్మాయి ప్రోద్బలంగూడా ఉన్నదనుకుంటాను ఆ అమ్మాయి యివ్వాళ ఆ పేర్లవంక వ్రేలు పెట్టి చూపిస్తూ ఒకటే నవ్వు.

భా. అవునమ్మా! కట్టెపిడి వేయబడని గొడ్డలి కట్టెలు కొట్టటానికి పనికిరాదుగా

ప: ఇక ఇటువంటి పిల్లలతో కలిసి మెలసి ఉండడ మెట్లాగో చెప్పండి?

భా భయంలేదు సత్యం సర్వకాలం కప్పబడి ఉండే వస్తువుకాదు నిజం నిలకడ మీద వాళ్లే తెలుసుకుంటారు మనం ఓర్పు వహించి ఉండాలె అంతే

ప అయితే నేను కాలేజీకి వెళ్లుతూ ఉండవలసిందేనా?

భా పోకుండా?

ప ఇంట్లో ఉండిపోదామనుకుంటున్నాను.

భా ఎట్టె! ఎంత పిచ్చి ఊహ! మన యోగ్యత వారిచేత ఒప్పించకుండానే?

(తెర)

[సశేషం]



# గడియారం

రామానగర్‌లో గంగాధరం గడియారాల వర్తకుడు. బజారులో పెద్దషాపుకూడా వుంది. ఆవూరులోనివారు నమ్మకంచే గడియారాలు కావలసి వస్తే అతని దగ్గరే కొంటూంటారు. అతని చేతిక్రింద యిద్దరు గుమాస్తాలు బ్రతుకుతున్నారు. యిద్దరిలోను జగన్నాధం అతని దృష్టిలో నమ్మదగినవాడుగా గుర్తింపబడ్డాడు. అందుకే కాబోలు గంగాధరం లేకపోయినా జగన్నాధం తన చేతిమీదుగా వర్తకం సాగిస్తూ వుంటాడు. కొన్నాళ్లకు జగన్నాధంలో మార్పు కనిపెట్టాడు గంగాధరం. షాపులో సరుకు తరిగిపోతోంది కాని గల్లాపెట్టెలో మాత్రం పెరుగు కనిపించలా. దీనికి కారణం జగన్నాధమే అని తలపోశాడు గంగాధరం. జగన్నాధం చేతిలోనే డబ్బుంటేది. గంగాధరం లెక్క జూచి సరిపెట్టమన్నాడు జగన్నాధాన్ని. కాని జగన్నాధం తగిన సంజాయిషీ యివ్వలేకపోయాడు. జగన్నాధం నేరస్థుడని ఋజువు చేసుకో తలచాడు గంగాధరం.

ఒక రోజున జగన్నాధం బావమరిది శ్రీనివాసరావు ఆవూరు వచ్చాడు. శ్రీనివాసరావుదగ్గర జగన్నాధం యిదివరకు కొంతడబ్బు బదులు తీసుకున్నాడు. ఆడబ్బు కోసం వచ్చాడు శ్రీనివాసరావు.



జగన్నాధం కొంతడబ్బు సరి పెట్టాడు. తతిమా డబ్బు బదులు గడియారం ఒకటి యిస్తానన్నాడు జగన్నాధం. ఈసంగతి కొందరి ద్వారా గంగాధరం తెలుసుకొన్నాడు. సామాను డెలివరీ కోసం స్టేషనుకు వెళ్లాడు రెండో గుమాస్తా. కొట్లో జగన్నాధం ఒక్కడే వున్నాడు. శ్రీనివాస రావు షాపుదగ్గరకు రావటం చూచాడు గంగాధరం. గంగాధరం రహస్యంగా షాపు గోడప్రక్కనే నుంచుండి జరిగే సంగతి చూస్తున్నాడు. తనకు వచ్చిన సమాచారం నిజమే. జగన్నాధం గడియారం యివ్వటం, శ్రీనివాసరావు తీసుకు వెళ్లటం జరిగింది. వెంటనే షాపులోకి వెళ్లి వాళ్లిద్దర్నీ పోలీసులకు పట్టిద్దామనుకున్నాడు. తొందర కూడదనుకుని పోలీసులకు రిపోర్టు యిస్తే వాళ్లే చెక్ చేసి వాళ్లిద్దర్నీ అరెస్టు చేస్తారనుకున్నాడు గంగాధరం. పోలీసులకు రిపోర్టిచ్చాడు. పోలీసులు వచ్చారు. గడియారం శ్రీనివాసరావుకి జగన్నాధం యిచ్చినట్లు సాక్షులు ఎవరూ లేరు. తనకు తనే సాక్షి. అంచేత క్రిమినల్ చర్య తీసుకోవటానికి వీలులేదన్నాడు సబిన్స్పెక్టరు. సామాను డామేజికి మాత్రం రిపోర్టు యివ్వమన్నాడు. అతడు చెప్పినట్లు రిపోర్టు యిచ్చాడు గంగాధరం.

మున్సబు కోర్టులో కేసు రిజిష్టరు చేయబడినది. నాలుగు మూడు వాయిదాలు జరిగినై. మున్సబుగారు ఆఖరివాయిదా వేశారు. గంగాధరం ప్లీడరుగారికి వాయిదారెండు రోజులుందనగా జ్వరం వచ్చేసింది. ప్లీడరుగారు రాలేకపోయారు. ఇంకో ప్లీడరును పెడితే ఆయనకు కూడా ఫీజుయివ్వాల్సివస్తుందని ప్లీడరును పెట్టడం మానేశాడు గంగాధరం. తనే వాదిద్దామనుకున్నాడు గంగాధరం. జగన్నాధం పేరుమోగిన ప్లీడరు రామారావు గారిని పెట్టాడు తన తరఫున. ప్రాక్టీసుకని రామారావుగారు జగన్నాధంచేత రిహార్సల్స్ వేయించాడు బెదురు లేకుండా మున్సబుగారు అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పటానికి. కోర్టులో దైవసాక్షిగా ప్రమాణం చేయాలని జగన్నాధంతో చెప్పారు రామారావుగారు. ప్రమాణం చేయటం దేవునియెదుట అబద్ధంఆడటం కాగలదనీ అందుచేత ప్రమాణం చేయలేనని చెప్పాడు జగన్నాధం. ప్రమాణం చేయకపోతే కేసు నెగ్గదని చెప్పారు ప్లీడరుగారు. ప్రమాణం చేయకుండా కేసునెగ్గిస్తే అదనంగా డబ్బిస్తానని ఆశజూపాడు జగన్నాధం. ప్లీడరుగారి బుర్రకొక ఆలోచన తట్టింది. మున్సబుగారు అడిగే ప్రతిప్రశ్నకు 'మెహే' అని మేక అరచినట్లు అరవమని చెప్పారు ప్లీడరుగారు. ఈ ఎత్తుకు చాలా సంతోషించాడు జగన్నాధం.

కోర్టు తెరచారు. మున్సబుగారు కుర్చీలో ఆసీనులైనారు. జగన్నాధం గంగాధరం బోనుల్లో ఎక్కారు. జగన్నాధం చాల రోజులనుంచీ తన దగ్గర గుమాస్తాగావుండి యిప్పుడు తనకొట్లో గడియారాలు ఎన్నో కాజేశాడని, మొన్న తనఎదురుగా ఒక గడియారంతీసి శ్రీనివాసరావుకిచ్చాడని, దగా, మోసం చేసిన ఈ నేరస్థుణ్ణి కఠినంగా శిక్షించా అని చెప్పాడు గంగాధరం మున్సబు గారితో.

'సాక్షులు ఎవరూ లేరా!' అని ప్రశ్నించాడు మున్సబుగారు. 'లేరు' అని చెప్పాడు గంగాధరం.

మున్సబుగారు జగన్నాధాన్ని ప్రమాణంచేయమన్నారు. 'మెహే' అని మేకఅరుపుయొకటి వినిపించింది. యింకోసారి అడిగారు. తిరిగి ఆ అరుపే వచ్చింది సమాధానంగా. అపనిందమోపి తనను వీధిమీద కెక్కించినందుకు జగన్నాధం చాల విచారపడ్డాడని, మతిపోయిందని చెప్పారు రామారావుగారు కుర్చీలోంచి లేచి నిలబడి.

అంతా విచారించి కేసుకొట్టేశానన్నారు మున్సబుగారు.

జగన్నాధం మొహం చాటంతయింది. గంగాధరం మొహం చిన్నబోయింది. న్యాయస్థానాల్లో న్యాయమని తిర్పునిస్తూ, అన్యాయాన్ని న్యాయంకింద చెల్లుబడి చేసే తీర్పుదారులను తిట్టాడు గంగాధరం.

కోర్టువారు ఫలహారాలకు లేవగానే కోర్టునుంచి కాంపౌండు బయటకు వచ్చాడు జగన్నాధం. ప్లీడరుగారు వెంటబడ్డారు.

'నా తెలివి తేటలతో నీ ఆపద రక్షించా! కనుక నువ్వు నన్ను సంతోషపెట్టు' అన్నారు ప్లీడరు రామారావుగారు.

'మెహే' అని దీర్ఘంగా అరపు అరచి యింటికి చక్కా పోయాడు జగన్నాధం.



సీరియల్:




మూలం: ఆల్ఫాన్స్ డాడే

## జరిగిన కథ

[మా నాన్నగారు—మష్యూ ఐసెట్టే—లాన్‌గ్వెడాక్‌లో పెద్ద సిల్కు వ్యాపారి. సొంత ఫ్యాక్టరీ అవీ వుండేవి. నేను (చిన్నా) పుట్టినరోజు లగాయితూ మా కుటుంబాన్ని ఏదో ఒక ఆపద చుట్టుముట్టేస్తూనే వుంది. చివరికి దేశంలో వచ్చిన విప్లవం మూలంగా మా నాన్నగారి స్థితి పూర్తిగా చితికిపోయింది. ఆ దెబ్బతో ఆయన మహా కోపదారి మనిషిగా తయారైనారు. నిర్జనమైన మా ఫ్యాక్టరీ ఆవరణలో నేను మా గేటు కాపలా వాడి కొడుకు 'రోజే'తో కలిసి 'రాబిన్‌సన్ క్రూసో' ఆట ఆడుతుండేవాణ్ణి. వాడికి బూతులూ అవీ చాలా వచ్చు. వాడితో సావాసం చేసినమీదట ఆ బూతులు నాకూ వచ్చేశాయి. ఒకరోజు మా వాళ్ళందరూ భోంచేస్తుండగా బండబూతు ఒకటి నా నోటివెంట వచ్చేసింది. దాంతో మా నాన్నగారు మండిపడి నన్ను స్కూలుకి పంపించాలన్నారు. స్కూలులో వడేసేముందు 'కన్‌ఫెషన్'కి తీసుకెళ్ళి ప్రాయశ్చిత్తం చేయించాలని మా పెద్దన్నయ్య అన్నాడు.]

## 2

అప్పటికి నేను పుట్టి ఏడేళ్ళే అయినా, ఆ ఏడేళ్ళలోనూ నేను ఏయే పాపాలు చేశానో అవన్నీ జ్ఞాపకం చేసుకొని చెప్పమన్నాడు ఫాదరీ. ఆ పని జరిగాక వరసగా రెండు రాత్రులు నాకు నిద్ర పట్టలేదు. చిన్న చిన్నవే అయినా అప్పటికే చాలా పాపాలు చేశానని అమితంగా బాధపడ్డాను. చేసిన పాపాలు చెప్పుకొనే ఘట్టంలో అక్కడికీ చిన్న జాగ్రత్త ఒకటి తీసుకొన్నాను. మరీ చిన్న పాపాలు ముందు చెప్పి, పెద్ద పెద్దవి తరువాత చెప్పాను. మెదడు మడతల్లో అట్టడుగున ఎక్కడో భద్రంగా దాచిపెట్టిన పెద్ద పాపాలు తడవ తడవకీ పైకివచ్చి పడగలెత్తిన పాముల్లా నన్ను భయపెట్టాయి. ఆ చర్చిలో, ఆ చీకటిలో, మరచిపోయిన పాపాలను పునశ్చరణ చెయ్యటం మహా బాధాకరంగా పరిణమించింది. లోలోపల నేను పడుతున్న అమితమైన ఆవేదన మూలంగా అక్కడి కక్కడే చచ్చిపోతుంటానేమోనని అనిపించింది.

ఆ క్షణంనుంచీ నాలో విపరీతమైన మార్పులు వచ్చేశాయి. నా నెచ్చెలి, నా నచ్చిపుడు 'రోజే'తో యిదివరకటిలా ఆప్యాయంగా కలిసిమెలిసి తిరగలేకపోయాను. మానవమాత్రులను ప్రలోభాలకు మరలించటంకోసం 'సైతాన్' సదా సంచారం చేస్తూ, యిష్టమొచ్చినప్పుడు యిష్టమొచ్చిన రూపం ధరించి మానవుల్ని తనవలలో వేసుకొంటాడని ఆ రోజున చర్చిలో ఫాదరీ చెప్పేడు. ఆ మాటలు నా మనస్సులో బాగా నాటుకుపోయాయి. 'సైతాన్' ధరించగల అనేక రూపాలలో 'రోజే' రూపమూ ఒకటై వుంటుందని నాకెందుకో ఒక గట్టి నమ్మకం ఏర్పడిపోయింది. నన్ను పాపాత్ముణ్ణిగా మార్చెయ్యటంకోసం సైతాన్ రోజే రూపంలో పొంచివున్నాడని నా మనస్సు నన్నం దగో పదేపదే హెచ్చరిస్తుండేది.

 అనువాదం: పెన్నొత్సుల నరసింహమూర్తి 



# అన్నా - చిన్నా



సంతోషం వాళ్లు విచిత్ర భాషలతో సాగించి మాశారు. నా సాగరపుష్పాల తోరణాల్ని కాల్చారు. పడేసి గజాలకొకసారి కొమ్మల అగ్గిపోయి తలలు వంచించి గుణ్ణమీకరించారు. చీకటి రేణువులన్నింటినైనా నా పన్నా నా పునికినీ పసిపాపల్లాగ వచ్చినవనే ఆలోచన మొదట్లో మెదిలినప్పటికీ విపరీతమైన భయంతో కంపించిపోయాను. అదృష్టవశాత్తు అటువంటిదేమీ జరగలేదు. అరగంటసేపు అన్ని వైపులా పరీక్ష చేసి, ఇలా నిర్జనద్వీపంలో నావంటి మనుష్యమాత్రం లేకుండా వుంటున్నాననే విషయం గ్రహించనైనా గ్రహించకుండా వెళ్లిపోయారు. వాళ్ళా అలా వెళ్లి పోగానే, నేను నా పాకల్లో ఒక దాంట్లోకి పోయి తలుపులు బిగించేసి ఆరోజు రోజంతా అందులోనే వణికిపోతూ వుండిపోయాను. ఆ మనుష్యులు ఎవరై వుంటారో, ఎందుకు వచ్చివుంటారో గ్రహించుకొని వణికిపోయాను.

అసలు వాళ్లు ఎవరో ఎందుకు వచ్చారో - ఆ తరువాత కొద్దిసేపటికే నాకు తెలిసింది.

ఆ రాత్రి భోజనాలదగ్గర మా నాన్నగారు మమ్మల్నందరినీ కూర్చోబెట్టి, మా ఫ్యాక్టరీ అమ్ముడై పోయిందని విషాద గంభీరస్వరంతో చెప్పారు. ఇక మీదట అయినన్న పట్టణంలో కాపురం పెట్టబోతున్నా మనీ, యింకో నెలరోజుల్లో మా కుటుంబం అంతా అక్కడికి తరలిపోవలసి వుంటుందనీ వెల్లడించారు.

ఆ వార్త వినగానే నాకు మిన్ను విరిగి మీద పడుతున్నట్లనిపించింది.........ఫ్యాక్టరీ అమ్ముడు పోతోంది. నేను ప్రాణప్రదంగా చూసుకొంటున్న నా మహోద్యానాలూ, నా నిర్జన ద్వీపాలు, నా పర్ణకుటీరాలు అన్నీ శాశ్వతంగా పరాధీనమై పోవలసిందేనా!

విధి బలీయంకదా! మా నాన్నగారు నా జీవిత సర్వస్వంతో సహా అన్నీ అమ్మివేశారు. ప్రాణప్రదంగా చూసుకుంటున్న ఆ ప్రదేశాలను నేను శాశ్వతంగా దూరమైనాను. ఆ రోజున ఎంతగానో ఏడ్చాను!...

అక్కడినుంచీ సంసారం ఎత్తివేసే ప్రయత్నంలో మా వాళ్లు అందరూ సామానులు సర్దుతూ నడుమ చూస్తున్నా ఆ నెలరోజుల పొడుగునా నేను మూర్తీభవించిన శోకదేవతలా ఒంటరిగా ఆ చెట్లు చేమల్లో తిరుగుతూ గడిపాను. అలాంటి పరిస్థితుల్లో నా మనస్సు ఆటలపైకి ఎంతమాత్రమూ వెళ్ళేది కాదని వేరే చెప్పనక్కరలేదనుకొంటాను. ఎప్పుడూ ఏదో ఒక మూల కూర్చుండిపోయి శోకపరితప్తమైన మనస్సుతో పరిచితమైన ప్రతి వస్తువునీ పలుకరించబోయే వాణ్ణి, మనసు తెలిసిన మిత్రుల్లా ప్రతి వస్తువునీ మూగబోయిన కంఠంతో పలుకరించాను. అశ్రుపూరిత నయనాలతో ఒక్కొక్క చెట్టుదగ్గరికీ వెళ్లి "వెళ్లొస్తాను నేస్తం! మళ్లీ మరి ఈ జన్మలో కలుసుకోము కాబోలు!" అంటూ సెలవు తీసుకొన్నాను. మా తోటలో ఒక మూలగా పెద్ద దానిమ్మచెట్టు ఒకటుంది! అదంటే నాకు చాలా యిష్టం. దాని కొమ్మలమీద కళ్లు మిరిమిట్లు గొలిపే ఎర్రని ఎర్రరంగు పూలు గుత్తులు గుత్తులుగా వేళ్లాడుతుంటాయి. ఆ పూలు అంటే నాకు మరీ యిష్టం. అందుకని ఆ చెట్టుదగ్గరికి పోయి కాస్సేపు గుక్కపట్టి ఏడ్చేశాను. కొంతసేపటికి గుక్క తిప్పుకొని చెట్టువంక చూస్తూ అతి జాలిగా అడిగాను-"నీపువ్వు ఒక్కటి యివ్వవూ! మన స్నేహానికి చిహ్నంగా దాన్ని ఎప్పుడూ నా దగ్గరే అట్టే పెట్టు కొంటాను." అని.

ఆ చెట్టు నిజంగా నాకో పువ్వు యిచ్చింది. దాన్ని అతి పదిలంగా తీసుకొని నా చొక్కా జేబులో భద్రం చేశాను.

అంతటి విషాదకర సన్నివేశంలోనూ నాకు చిరునవ్వు తెప్పించిన అంశాలు ఒకటి రెండు లేక పోలేదు. ఓడలో ఎక్కబోతున్నాననే ఆలోచన నాకు కొంత ఉత్సాహాన్ని ఇచ్చినమాట వాస్తవమే. మరొకందుకు కూడా నాకు సంతోషంగా వుంది. నా చిలుకనీ పంజరాన్ని అక్కడే వదిలెయ్యక్కరలేకుండా నాతో పాటు తెచ్చుకోవటానికి మా పెద్దవాళ్లు ఒప్పుకొన్నారు. ఆ మాట తలుచుకొన్నప్పుడు, "రాబిన్‌సన్ క్రూసో" కూడ తననిర్జనద్వీపాన్ని వదలిపెట్టివచ్చేసినప్పుడు యిలా మాదిరిగానే వచ్చేశాడన్న విషయం జ్ఞాపకం వచ్చేది

ఆ వృత్తాంతం జ్ఞాపకం రావటంతో నా మనస్సులో ఆవరించిన మబ్బుతెరలు విడిపోయినట్లు అనిపించింది.

మా స్వంతవూరు విడిచిపెట్టిపోవలసిన రోజు రానే వచ్చింది. అప్పటికి వారం రోజులక్రితమే మా నాన్నగారు బరువైన సామాను కొంత తీసుకొని ముందుగా లయాన్స్ పట్టణం చేరిపోయారు. పోగా మిగిలింది నేనూ, మా అమ్మా, మా జాక్, మా వంటలక్క ఆనీ! మతప్రచారకుడుగా పనిచేస్తున్న మా పెద్దన్నయ్య మాతోపాటు ప్రయాణమవటం లేదు కాని మమ్మల్ని సాగనంపటంకోసం 'బ్యాక్లైరీ' గ్రామం వరకూ వచ్చాడు. మా గేటుకాపలావాడు 'కొలాంబీ' కూడా అంతే. తోపుడుబండి నిండా సామాను వేసుకొని మా అందరికంటే ముందు వాడే దారి తీశాడు. వాడివెనుక మా పెద్దన్నయ్య అమ్మను చెయ్యి పట్టుకు నడిపిస్తున్నాడు.

(అతన్ని నేను చూడడం అదే ఆఖరుసారి!)

మా అమ్మవెనకాలే వంటలక్క 'ఆనీ' నీలపు రంగు గొడుగు తెరిచి పట్టుకొని నడుస్తోంది. మా అన్న జాక్కి మొత్తానికి యీ ప్రయాణం, యీ హడావుడి అంతా సరదాగానే వుంది; అయినా వాడు అలవాటుగా ఏడ్చే ఏడుపుమాత్రం మానలేదు. కళ్లంబడి నీళ్లు అలా ఏకధారగా కారుతూనే వున్నాయి. అందరికంటే చివర, యీ "చిన్న" (డేనియల్ ఐసెట్ పేరున జరిగే యీ చిన్నవాడు) చేతిలో చిలకపంజరం పట్టుకొని గంభీరంగా నడుస్తున్నాడు. అడుగడుక్కీ వెనక్కి తిరిగి, తను పుట్టిన ఫ్యాక్టరీవంక కొసరి కొసరి చూస్తున్నాడు.

కాందిశీక బృందంలా కదలిపోతున్న మా కుటుంబానికి అన్నేళ్లుగా అలవాటుపడిన చెట్లు, కొమ్మలు వూగుతూ వీడ్కోలు వాక్యాలు పలుకుతున్నట్లున్నాయి. మరీ ముఖ్యంగా ఆ దానిమ్మచెట్టయితే, దూరంగా కదలిపోతున్న తన నేస్తాన్ని కడసారి చూడడంకోసం చాటున వేళ్లమీద నిలబడి చూస్తున్న పెద్దమనిషిలా ఆకాశంలో అంతకంతకూ ఎత్తుగా ఎదిగి కనుపిస్తోంది. డేనియల్ ఐసెట్ వెనక్కి తిరిగి వాటి వీడ్కోలును అందుకొని, వాటికోసం గాలిలో ముద్దుల పరంపరలు వదిలిపెట్టుతున్నాడు.

నాకు ప్రియాతిప్రియమైన నా ద్వీపాన్ని నేను 18-- సెప్టెంబరు 30 న వదిలి వచ్చేశాను.

(ఇంకా ఉంది)

# ప్రేమే దైవము

మూలం: లియో టాల్‌స్టాయ్ ★ అనువాదం: మధురాంతకం రాజారాం

అతనిపేరు నాగన్న. చెప్పులు కుట్టి అమ్ముకోవడం అతనికులవృత్తి. ఆతడు ఇల్లూ, వాకిలీ పొలం పుట్రా లేని నిరుపేద. ఊరిబయట చింతతోపు ప్రక్కన పాడుబడిన సత్రంలో కాపురం. దొరికే కూలీ తక్కువ, నూకలధర ఎక్కువ. తనూ, పెండ్లామూ బిడ్డలూ వెరసి కుటుంబంలో వున్న వాళ్లు మొత్తం ఐదుమంది. ఎంత సంపాదించినా తిండికే చాలని బ్రతుకు నాగన్నది!

నాగన్న భార్య రంగి మాసికలతో నిండిన చీరనొకదాన్ని శరీరానికి చుట్టుకుని ఊళ్ళోకి వెళ్ళి ఏ రైతు ఇంట్లోనో చాకిరీ చేసి ఇన్ని నూకలు తెస్తూ వుంటుంది. ఆమెకోక కొత్తచీర కొనివ్వాలని నాగన్న ఎంతో కాలం నుంచీ ఆలోచిస్తూనే వున్నాడు. ఎంత పనికిరాని చీరకైనా నాలుగైదు రూపాయలు కావాలి! తినీ తినకుండా రెండు, మూడు నెలలు కూడబెట్టితేగానీ అంతడబ్బు మిగలదు.

నాలుగైదు రోజుల్లో 'సంకురాత్రి' పండుగ రాబోతోంది. ఏలాగో నాగన్న రెండురూపాయలు మాత్రం మిగిలించగలిగాడు. ఊళ్ళో ఇద్దరు ముగ్గురు ఆసాములు అతనికి రెండు, రెండున్నర రూపాయలదాకా బాకీవున్నారు. వాళ్లివ్వగలరన్న ధీమాతో "రంగీ! ఈరోజు నీకు కొత్తచీర కొనితెస్తా" అని నాగన్న ఊళ్ళోకి వెళ్ళాడు. రైతులు "ఇప్పుడెక్కడ! పంటలు అరవడి అయినాక ఇస్తాములే" అని మొండిచెయ్యి చూపించారు. అతడు బట్టల దుకాణానికి వెళ్లి ఒకచీర అరువుగా యిమ్మని ప్రాధేయపడ్డాడు. కోమటి వికటంగా నవ్వి "ఈరోజుల్లో మహారాజులకే అరువు యివ్వడంలేదురా. వెళ్ళు, వెళ్ళు" అన్నాడు. నాగన్నకు మతిపోయినట్టయింది. మతిపోయినట్టున్నప్పుడల్లా అతనికి సారాయిఅంగడికి వెళ్లడం అలవాటు. ఆమామూలు తప్పించకుండా అతడు సారాదుకాణానికి దారి తీశాడు.

త్రాగితూలుతూ ఇంటికివస్తూ నాగన్న తను గాలిలో తేలిపోతున్నట్టు భావించుకుని పాటలు పాడుకోసాగాడు. అప్పుడప్పుడూ రాగాన్ని కట్టిపెట్టి స్వగతంగా మాట్లాడుకోసాగాడు.

"నాదగ్గర చెప్పులు కుట్టించుకున్నారు. కానీ డబ్బులేదంటారు. రెండురూపాయల చెప్పులకు అరణాలిస్తామని బేరమాడ్తారు. అరణాలెందుకు పనికొస్తాయి, త్రాగి తందనా లాడ్డానికి తప్ప!...నువ్వు, నీదగ్గర డబ్బులేదంటున్నావ్! ఇండ్లు, పొలాలు, తోటలు, ఇవన్నీ వున్నాయి నీకు! నీదగ్గరే డబ్బులేకపోతే అదింకెవరిదగ్గరుంటుందబ్బా! నాలాంటి బికారివాడిదగ్గరనా వుంటుంది డబ్బు! ఏయ్, నాకు తెలుసు! నువ్వు నన్నెలాగైనా బుట్టలో వేయాలని చూస్తున్నావ్. అదేం సాగదమ్మా! మొదట నాడబ్బు అక్కడపెట్టి, మళ్ళీ మాట్లాడు."

నాగన్న ఊరి పొలిమేరని దాటుకుని చెరువుకట్టపైకి వచ్చాడు. మసకచీకటిలో కట్టపైని తుమ్మచెట్లు అతనికి భూతాల్లా కనిపించాయి. కానీ భూతాలంటే నాగన్నకి భయంలేదు. వాటి ప్రసక్తి వచ్చినప్పుడల్లా అతడు "నేను దయ్యాలకు జేజమ్మ మొగుడినండోయ్" అని కీవిగా చెప్పుకుంటూ వుంటాడు. కానీ, అలాంటి నాగన్నే తూముదగ్గర శిలావిగ్రహంలా నిలబడివున్న ఒక మానవాకారాన్ని చూచి నిశ్చేష్టుడై పోయాడు!

నిజంగా అదేదో విగ్రహమేననుకున్నాడు నాగన్న మొదట! కానీ అక్కడొక విగ్రహమున్నట్టు అతనికి గుర్తులేదు. పోనీ ఇదేదైనా క్రూరమృగమా! నాగన్న బాగా పరకాయించి చూచాడు. ఒక కాలును చాపుకుని, మరొక్క కాలి మోకాటిపైన తలఆనించుకుని వేమనయోగిలా అక్కడొక వ్యక్తి కూచుని వున్నాడు. 'ఎవడైతే

మన కేంతే' అని ముందుకుపోబోయి మళ్లీ అతని దురవస్థని చూచి నాగన్న అక్కడే ఆగిపోయాడు.

చలికాలపు ఈదరగాలి రివ్వు రివ్వున వీస్తుండగా, చెరువుకట్టపైన తుమ్మచెట్ల మధ్య ఏకాకిగా కూచునివున్న ఆగోచిపాతరాయుణ్ణి పలకరించకుండా వెళ్లిపోవడం నాగన్నకు అమానుషంగా కనిపించింది. 'పాపం, అత జీతల్లికన్న బిడ్డో! ఎలాటి కష్టానికి గురై ఇలా తయారయ్యాడో? సమయం వచ్చినప్పుడు తోడి మానవుడికి సహాయ పడకపోతే నేను బ్రతికిమాత్రం ఏంఫలం!' అనుకుంటూ నాగన్న ఆవింతమనిషి దగ్గరికి వెళ్ళాడు.

ఎవరో తనను సమీపిస్తున్నారని తెలియగానే గోచీపాతరాయుడు తలపైకెత్తి నాగన్న చూచాడు. 'దిక్కులేని దీనుడిపైన ఇంత సెన రుంచి, వాడిని తన చెంత జేర్చుకోవాలని ఆశించే మానవోత్తములు కూడా ఈ ప్రపంచంలో వున్నారా' అని ప్రశ్నించిండా చూపు నాగన్నని! 'లేకేంనాయనా, ప్రపంచమింకా దయా దాక్షిణ్యాలకు గొడ్డుపోలేద' న్నట్టుగా నాగన్న తను తలకు చుట్టుకునివున్న పంచని తీసి ఆమనిషిపైనకప్పి 'అంతా తరువాత మాట్లాడుకుందాంగానీ నాతోరా నాయనా! ఈచలిగాలికి మనం నిభాయించలేం' అంటూ అతణ్ణి పైకిలేపి చేయిపట్టుకుని మెల్లగా నడిపించుకుంటూ ఇంటికి దారితీశాడు.

దారిమధ్యలో నాగన్న అతణ్ణి సంభాషణలోనికి దింపాడు. "ఏం, బాబూ! నువ్వు మూగవాడివి కాదుగదా! ఎందుకు మాట్లాడకుండా ఊరుకుంటున్నావు? అసలు నీ దే వూరేమిటి?"

"నేనీ ప్రాంతానికి సంబంధించిన వాణ్ణికాను. ఎక్కడినుంచో వస్తున్నాను."

"పోనీ, దగ్గరలోనే ఊరు వుండగా, ఈ కట్టపైన ఎందుకు కూచున్నావ్!"

"ఎందుకు కూచున్నానో నాకు తెలియదు."

"నువ్వెవరికో భయపడి పారిపోయి వచ్చినట్టున్నావ్! ఎవరైనా నీకు కీడు తలపెట్టారేమిటి?"

"అబ్బే, నాకెవరు కీడు తలపెడతారు! ఇది నాకు దేవుడు విధించిన శిక్ష!"

"అదినరేలే! మనలాటి వాళ్లపైన ఆదేవుడికెందుకో తీరని కోపమని నాకూ తెలుసుననుకో! పోనీ, నువ్వెక్కడికి పోవాలనుకుంటున్నావ్!"

"ఎక్కడికైతేనేం! నాకు గమ్యస్థానమంటూ ఏదీలేదు. ఎక్కడికైనా సరే!"

"చాలా విచిత్రమైనవాడివి బాబూ! నీపేరేమిటి?"

"తెలియదు. అందరూ నన్ను 'సన్యాసి' అంటారు."

## 2

ప్రొద్దు పోకముందే రంగి వంట పనులు ముగించి, భర్తకోసం ఎదురు తెన్నులు చూడసాగింది.

పెట్టెలనిండుకూ డబ్బువున్న శ్రీమంతుల ఇండ్లల్లోని ఆడవాళ్లకు కూడా క్రొత్తచీరలపైన చెప్పరానంత మమకారం వుండడం లోకసహజమైనప్పుడు, ఒక్క-సంవత్సరం తర్వాత తనొక క్రొత్త చీరని కళ్లజూడబోతున్నందుకు రంగికిమాత్రం కుతూహలం వుండదూ! ఆమె ఆనందంతో చిన్నప్పుడెప్పుడో పాడుకున్న పాటల్ని మళ్ళీ ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకుని సన్నసన్నగా పాడుకోసాగింది!

ఇంతలో ఆమెకు బయటనుంచీ పదధ్వనులు వినిపించినాయ్. నాగన్న సన్యాసితోసహా ఇంట్లో ప్రవేశించాడు.

భర్తచేతిలో క్రొత్తచీరలేదు. అతడు కొంచెంగా తూలుతున్నాడు. సందేహంలేదు, బాగా త్రాగివుంటాడు. కోకకోసం దాచిపెట్టిన డబ్బుని సారాయి అంగడివాడికి చెల్లించి వస్తూ, వస్తూ ఊరికేరాక ఒక గోచిపాతరాయణ్ణి వెంట దీసుకుని వచ్చాడు.— ఆసమయాన రంగికి వచ్చినకోపం, అబ్బో, అది మాటల్లో చెప్పడానికి వీలుకానిది!

భార్య అగ్గిమీద గుగ్గిలంలా తయారైవుందని నాగన్నకి తెలుసు. కానీ అతడా విషయాన్నట్టే పట్టించుకోకుండా "అన్నమయిందా" అని ప్రశ్నించాడు.

"ఐంది, ఐంది" అంటూ రంగి గర్జించసాగింది. "ఐతే నీకుకాదు నేను అన్నంవండింది. తాగి మతి పోగొట్టుకున్నావల్లే వుంది నువ్వు! కోకతెస్తానని వెళ్లి, తాగి తందనాలాడుతూ, ఒకదేశగాకిని వెంట బెట్టుకుని వచ్చావూ! నీజోటి తాగుబోతులకు కాదు నేను వంటచేసేది!"

"చాల్లే రంగీ! ఎందుకలా ఉరుముతావు!" అంటూ నాగన్న భార్యని సముదాయించబోయాడు.

# ★ ప్రేమే దైవం ★

"ముందు నేనడిగిందానికి జవాబు చెప్పు. డబ్బును ఏంచేశావేమిటి?" అన్నది రంగి ఏడుపు ప్రారంభించటానికి గొంతుకను కూడదీసుకుంటూ! నాగన్న జవాబు చెప్పకుండా ఊరుకున్నాడు.

"ఐతేపో! ఈరోజు నీకు అన్నం లేదు. నీకూ, నీతోకూడా వచ్చే ఆ శ్రద్ధిమ్మరిగాళ్లకూ వంటలు వార్చి పెట్టడానికి మావల్లకాదు" అన్నది రంగి.

"రంగీ! నామాటలు వినిపించుకోవేం" అంటూ దీనంగా బ్రతిమాలాడు నాగన్న.

"ఏడీ, నువ్వు చెప్పదలచుకున్నదేదో, కానీ!" అంటూ నాగన్నను ఉరిమి చూచింది రంగి.

"పాపం, ఇతణ్ణిచూడు ఎలా వున్నాడో! ఎముకలగూడుగా కనిపిస్తున్నాడు కదూ! చెరువుకట్టపైన వస్తూ చూచాను, ఇతడు తూము దగ్గర తుమ్మచెట్టుక్రింద చలికి గజగజ వణికిపోతూ కూచుని వున్నాడు. ఏంచేయమంటావ్! చూచీ, చూడకుండా వచ్చేయడం మంచిదేనా చెప్పు. మనం మాత్రం మనుషులం కామూ! మనకూ కష్టాలు రావూ! మనమందరమూ ఎప్పుడో ఒకప్పుడు చావాల్సిన వాళ్లమేనంటావా, కాదంటావా! అలాంటప్పుడు ఒకడు కష్టపడుతున్నప్పుడు మరొకడు వాడికి ఆదుకోకపోతే ఎలాచెప్పు!" అని నాగన్న రంగిని అనునయించాడు.

రంగికి కోపంతగ్గలేదు. కాని సన్యాసిని చూడగా, చూడగా అతనిపైన ఆమెకూ జాలికలుగ సాగింది. ఏవో తీరనిచింతలు, ఆరని వ్యధలు నాట్యంచేస్తున్న అతడి ముఖాన్ని పరీక్షించి చూచిన తర్వాత ఆమెలోని ఆగ్రహం పటాపంచలై పోయింది. వెంటనే ఆమె ఉట్టిలోనుంచీ, చట్టిని దించి రెండు ముంతల్లో అంబలిపోసి "ఇద్దరూ త్రాగండి" అన్నది.

"మరినీకో?" అన్నాడు నాగన్న ఆశ్చర్యంగా.

"ఒకపూట త్రాగకపోతే చచ్చిపోనులే" అన్నది రంగి.

"అలాకాదు రంగీ! చెరికొంచెం త్రాగుదాం" అన్నాడు నాగన్న.

రంగి నవ్వుతూ "అబ్బబ్బ, ఎంత ప్రేమ, ఎంత ప్రేమ! నేనప్పుడే కొంచెం త్రాగానులే. నువ్వు కొంచెం త్రాగి, నాభాగాన్నికూడా అతనికే ఇచ్చేయి. పాపం ఎక్కడ తిన్నాడో ఏమో! ముఖం వాడిపోయివుంది" అన్నది.

తటాలున తలపైకెత్తి సన్యాసి నవ్వాడు. ఏదో ఒక పరమ రహస్యాన్ని తెలుసుకున్నప్పుడు కలిగే విజయగర్వం ద్యోతకమైందా నవ్వులో!

సన్యాసి అంబలి త్రాగిన తరువాత రంగి ఈతచాపను పరచి దానిమీద అతణ్ణి పడుకోమన్నది నాలుగు గోడలమధ్య వున్నప్పటికీ అతడింకా చలికి అదిరి పోతుండడం చూచి "ఏమయ్యా! ఇక్కడే ఇలా వణికిపోతున్నావే. ఆ చెరువుకట్ట పైనేవుండివుంటే ఏగతేమైవుండేది" అంటూ విస్తుపోయింది. "ఏమైతేనేంలే తల్లీ! 'నా' అన్నవాళ్లులేని ఒంటరిగాణ్ణి. నాగతేమైపోయినా చింతించేవాళ్లెవరూలేరు" అన్నాడు సన్యాసి. "ఇంతవరకూ అలా అనుకున్నావ్. ఇకమీదట అలా అనుకోకు. నువ్వు మావాడివి. అంతగా నీకెవ్వరూ లేకపోతే, మాఇంట్లోనే వుండిపో" అంటూ రంగి ఒక పాత దుప్పటిని తెచ్చి అతనిపైన కప్పింది. తరువాత నాగన్నని చూస్తూ "ఈరోజేమో ఎలాగో గడిచిపోయింది రేపటి కింక చిల్లిగవ్వైనా చేతిలో లేదే. నూకల్ని ఎక్కడినుంచీ తేబోతావ్?" అని అడిగింది.

"మనకీ నూకలకష్టం రేపటి కొక్కనాటికేనా రంగీ! మనం బ్రతికినంత కాలమూ వుంటుంది. పైన భగవంతుడున్నాడులే. నువ్వు పడుకో" అన్నాడు నాగన్న.

"అదిసరేగానీ, మనం మనశక్తి కొద్దీ ఇతరులకి సాయపడుతూ వుంటామే! మనకు మాత్రం ఎవరూ సాయపడ రెందుచేత?"

"ఎందుకో నాకేం తెలుసునే పిచ్చిరంగీ! నేను సర్వమూ తెలిసినవాడిననా నీ అభిప్రాయం. మనకంత పెద్దమాటలెందుకుగానీ నువ్వు మాట్లాడకుండా పడుకో. నాకు నిద్ర రొస్తూంది". అంటూ నాగన్న బొంతను బాగా కప్పుకున్నాడు.

## 3

చల్లగా తెల్లవారింది. కోడి కూయకమునుపే లేచి రంగి పాచి చేసి రావడానికి ఊళ్ళోకి వెళ్లి పోయింది. పిల్లలు చిదుగుల్ని ఏరి తెచ్చి చలికాచుకుంటు[illegible]

నాగన్న మళ్లీ సన్యాసిని మాటల్లోకి దింపాడు.

"మన మందరమూ మనుషుల మయ్యా! దేవతలం కాము. మనకు ఆకలి దప్పులు వున్నాయి. బ్రతకాలంటే మనమేదైనా పనిచేసి పొట్ట పోసుకోవాలి. నీకేపనైనా చేయడానికి తెలుసునా?"

"అబ్బే, తెలియదే!"

"తెలియకపోతేనేం, నేర్చుకో. రెండురోజులు నేను చేసేపనిని చూడు. మూడోరోజుకల్లా నీకు చెప్పులు కుట్టడం చేతనౌతుంది."

నాగన్న అన్నట్టు రెండు రోజుల్లో సన్యాసి చెప్పులు కుట్టడం నేర్చుకున్నాడు. ఇద్దరూ కలిసి పని చేయడంవల్ల రాబడి కూడా ఎక్కువయింది. పదిరోజుల్లో రంగికి కొత్తచీర కొనివ్వడానికి వీలయింది. నూకలకు ఎద్దడి లేకుండా సంసారం హాయిగా జరిగిపోసాగింది.

ఒకరోజు మధ్యాహ్నం నాగన్న ఇంటిముందొక జట్కా ఆగింది. అందులోనుంచీ ఒక శ్రీమంతుడు క్రిందికి దిగి చకచకా లోపలికి వచ్చాడు. ఆకస్మికంగా ఒక పెద్దమనిషి తన ఇంట్లోపలికే వచ్చేయడంచూచి నాగన్న లేచినిలబడి "ఏమండీ! ఏంకావాలి మీకు?" అని అడిగాడు.

"బూట్సుల్ని కుట్టగలవా!" అన్నాడతడు.

"అదేనండీ నాపని" అన్నాడు నాగన్న.

శ్రీమంతుడు తన నౌకరును పిలిచి "దాన్నిలా తెచ్చి పడేయ్" అన్నాడు. నౌకరు జట్కాలోనుంచీ ఒక కాగితపు పొట్లాన్ని తెచ్చాడు.

"దానిలోఏముందోవిప్పిచూడు" అన్నాడు పెద్దమనిషి. నాగన్న పొట్లాన్ని విప్పాడు. అందులోనుంచీ మంచిఖరీదైన చర్మం బయట పడింది.

"ఇదేమిటో తెలుసునా!" అని ప్రశ్నించాడు శ్రీమంతుడు.

"తెలియకేమండీ, తోలు!" అన్నాడు నాగన్న.

"అరలే, ఆమాత్రం నాకూ తెలుసులే. బాగా చూడవయ్యా దాన్ని. జర్మనీనుంచీవచ్చిన తోలు ఇది. పాడుచేశావంటే మాటదక్కదు. రేపు సాయంత్రంలోగా బూట్సులు తయారైపోవాలి. ఆలస్యం జరగ్గూడదు. పాడుచేశావా, నీదగ్గర నుంచీ పదిరూపాయలు వసూలు చేస్తాను. నాకాళ్లకు సరిపోయేలా, బాగా కుట్టావంటే నీ ముఖాన ఐదు రూపాయలు విసిరిపారేస్తాను."

"అలాగేనండీ. రేపుసాయంత్రానికంతా పూర్తిచేసేస్తాను" అన్నాడు నాగన్న.

"ఊరికే తయారుచేసేటప్పు





# ప్రేమే దైవం



కాదయ్యా! ఒక్క సంవత్సరం నేనిలా త్రొక్కినా అరిగి పోకుండా వుండాలి, తెలుసా! అరిగిపోతే..." అంటూ బెదరించాడు శ్రీమంతుడు.

సన్యాసి తటాలున తలపైకెత్తి ఆ పెద్దమనిషిని చూస్తూ పకపకా నవ్వేశాడు! మొదటిరోజున రంగి తనపైన ఆదరం చూపినప్పుడు నవ్వింది మొదటినవ్వు. ఇది రెండో నవ్వు.

"ఏమిటోయ్, ఎందుకు నవ్వుతావ్?" అని బెదరించుకున్నాడు ధనవంతుడు. ఎందుకు నవ్వాడో తనకూ తెలియకపోవడంచేత నాగన్న విస్మయంతో "అతడంతేనండి. కొంచెం మతిస్వాధీనంలో లేని మనిషి. తమరు మరేం అనుకోకండి బాబూ!" అని సర్ది చెప్పేశాడు.

"ఓహో, అలాగా! ఐతే అతడెక్కడయినా నా బూట్సుల్ని కుట్టబోయి పాడు చేశేసేను, జాగ్రత్త! నేను రేపుసాయంత్రం తప్పక వస్తాను." అంటూ పెద్దమనిషి జట్కాలోకూచుని తనదారిన తాను వెళ్లిపోయాడు.

మరునాడు తెల్లవారగానే సన్యాసి కొత్తచర్మాన్ని చేతికి తీసుకుని బూట్సుల్ని కుట్టడం ప్రారంభించాడు. ఆపనిలో అతనికి చిరకాలానుభవం వుండి గనుక నాగన్న క్రొత్తగా సలహాలేమీ ఇవ్వలేదు. అతడు సలక్షణంగా బూట్సుల్ని తయారుచేశేయగలడనుకుని తనపనిలో తాను వుండిపోయాడు. కానీ, సన్యాసివల్ల కథ అడ్డం తిరుగుతుందని అతడు మధ్యాహ్నానంతరం కానీ కనిపెట్టలేకపోయాడు. అప్పటికి పనంతా పూర్తయిపోయింది. ఐతే తయారైనవి బూట్సులు కావు, సాదా చెప్పులు!

"కొంపముంచేశావు గదయ్యా! బూట్సుల్ని కుట్టమంటే, చెప్పులెందుకు కుట్టావయ్యా!" అంటూ నాగన్న వాపోవసాగాడు.

ఇంతలో ఇంటిముందర జట్కా ఆగింది!

కానీ లోపలికి వచ్చింది శ్రీమంతుడు కాదు. అతడి నౌఖరు. నాగన్న భయపడుతూ లేచినిలుచుకున్నాడు.

"పాపం, మీకు శ్రమ కలిగిస్తున్నానల్లేవుంది. కానీ, ఏంచేయడానికీ వీల్లేని పరిస్థితి యిది. ఇప్పుడు మాకు కావలసింది బూట్సులు కావు సాదా చెప్పులు!" అన్నాడు ధనవంతుడి నౌఖరు.

నాగన్న ఆశ్చర్యంతో నోరు తెరుచుకుని మట్టిబొమ్మలా నిలబడి వుండిపోయాడు. మళ్ళీ ఆ నౌఖరే మాట్లాడసాగాడు. "హఠాత్తుగా గుండె ఆగిపోవడంవల్ల మా యజమాని చనిపోయాడు. కొత్త చెప్పుల్ని కాళ్లకు తొడిగి శవాన్ని భూమిలో పాతిపెట్టడం వాళ్ల కులాచారమట!"

సన్యాసి ముఖంలో ఆశ్చర్యపు ఛాయలు లీలగానైనా కనపడలేదు. అతడు అంతవరకే సిద్ధమైవున్న చెప్పుల్ని తీసి, నౌఖరు చేతిలో పెట్టాడు. నౌఖరు అయిదురూపాయలనోటును నాగన్న చేత బెట్టి చరచరా వెళ్ళిపోయాడు.

## 4

ఐదేండ్లువరుసగా కాలగర్భంలో లీనమైపోయాయి. సన్యాసి నాగన్న ఇంట్లోనే వుండిపోయాడు. వర్షాలు కురిసి, దేశం సుభిక్షంగా వున్నందువలన నాగన్నకు ఆదాయం బాగా రాసాగింది. రంగి ఊళ్ళో చాకిరీగూడా మానివేసి, వేళకింత వండిపెడుతూ హాయిగా కాలం గడపసాగింది. తమకుటుంబం ఒక్కింత కుదుటపడడానికి సన్యాసే కారణమని నమ్మి ఆ పేద దంపతులతన్ని కన్నకొడుకులా గారాబంగా చూచుకోసాగారు.

ఇలా కాలం సాఫీగా గడచిపోతున్న రోజుల్లో ఒకానొకనాడు ఒక పొరుగూరి ఇల్లాలు నాగన్న దుకాణానికి వచ్చింది. ఆమె వెంట ఇద్దరు ఆడబిడ్డలున్నారు. ఎవర్నిగానీ పరకాయించి చూడ్డం అలవాటులేని సన్యాసి, వాళ్లనెందుకో తదేకదీక్షగా చూడసాగాడు. ఆబిడ్డలిద్దరూ వయసులోనూ, ఆకారంలోనూ ఏమాత్రమూ తారతమ్యం లేక ఒకే అచ్చులో పోతపోయబడ్డ విగ్రహాల్లా వున్నారు. ఎర్రటి పెదవులపైన లేనవ్వులు వెన్నెల తళుకుల్లా మెరసిపోతుండగా ఆ పాపలిద్దరూ తల్లికి చెరీ ఒకవైపున చూపరుల కళ్లకు పండువను కలుగజేస్తూ నిలబడి వున్నారు.

"కూచోండమ్మా! ఏంకావాలి మీకు" అని నాగన్న ఆమెను పలకరించాడు.

"ఈ బిడ్డలిద్దరికీ కాలిజోళ్ళు

తయారుచేసి ఇస్తావూ" అని అడిగిందామె అరుగుమీదకూచుంటూ.

నాగన్న బిడ్డలిద్దర్నీ దగ్గరకు పిలిచి కాలికొలతలు తీసుకుంటూ ఒక పాప పాదాన్ని చూచి ఆగి 'ఇదేమిటమ్మగారూ! ఈకాలు కొంచెం వంకరపోయినట్టుందే! పుట్టుకతోనే ఇల్లా వుందేమిటి?" అని ప్రశ్నించాడు.

"చావు పడకమీద దేహంపైన స్మారకం లేకుండా పడివుండిన తల్లి ఈబిడ్డపైన పొర్లడంవల్ల ఈ కాలిలా వంకర పోయింది. అప్పటినుంచీ ఇలానేవుంది" అన్నదామె.

"ఐతే వీరు మీ బిడ్డలు కాదన్నమాట!" అంటూ రంగి ఆశ్చర్యపడ్డది.

"కాకపోతేనేం. పురుడు తీరకముందే తల్లినిపోగొట్టుకున్న పిల్లకు నేనే పాలిచ్చి పెంచాను. అబ్బో అదంతా ఒక పెద్దకథలే!" అన్నదామె.

ఆకథ వినాలని అక్కడున్న వాళ్ళందరికీ కుతూహలంగానే వుంది కాబట్టి పొరుగూరి ఇల్లాలు ఆకథని చెప్పక తప్పలేదు.

"ఆరు సంవత్సరాలకు ముందు జరిగిన సంగతి" అంటూ ప్రారంభించిందామె. "ఒకవారం రోజుల వ్యవధిలోనే ఈబిడ్డల తల్లి దండ్రు లిద్దరూ పరలోకం చేరుకున్నారు. తండ్రి మంగళవారం చనిపోయాడు. తల్లి శుక్రవారాన గతించింది. దిక్కులేని బిడ్డల్ని నేను ఇంటికి తెచ్చుకున్నాను. అప్పటికి నాకొక నాలుగునెలల మగబిడ్డ వుండేవాడు. ముగ్గురికీ వరుసగా పాలిస్తూ, పెంచాను. రెండేళ్ళ ఈడువచ్చాడు నాబిడ్డ చచ్చిపోయాడు. తరువాత నాకు బిడ్డలు కలుగలేదు. కడకు ఈపాపలే మిగిలారు. ఓపినంత ఆస్తి వుంది మాకు. కాని ఆ ఆస్తికంటే ఈబిడ్డలిద్దరే మాకు పెద్దఆస్తి! వట్టి ప్రమిదెలా వుండవలసిన మాయింటికి ఈ ఇద్దరూ రెండు జ్యోతులు."

ఈ కథని వింటూ, వింటూ సన్యాసి ఎందుకోగాని విస్మయపరవశుడైపోతూవచ్చాడు. కథ ముగిసిన తర్వాత ఆకాశంవైపు చూస్తూ చేతులు జోడించుకుని తన ఐదేళ్ల జీవితంలో మూడోసారిగా మెల్లగా నవ్వాడు.

## 5

బిడ్డల్ని పిలుచుకుని పొరుగూరి ఇల్లాలు అక్కడినుంచీ వెళ్ళిపోయింది. ఆమె వెళ్లిపోవడమే తరువాయిగా సన్యాసిలేచి నిలబడి "నాగన్నా! ఇకనాకు సెలవిప్పించాలి. భగవంతుడు మళ్ళీ నన్ను కరుణించాడు. నేనిక్కడినుంచీ తక్షణం వెళ్లిపోవాలి" అన్నాడు.

నాగన్న ఆశ్చర్యచకితుడై, సన్యాసిని తేరిపారజూచాడు. అతని ముఖమండలం చుట్టూ ఏదో ఒకవింత తేజస్సు అలముకుని వుంది.

"ఏనా నీసంగతేమిటో మాకేమీ అర్థంగావడంలేదు బాబూ! ఉన్నట్టుండి ఎక్కడికో వెళ్లిపోవాలంటున్నావేమిటి! ఎక్కడికి పోదలచుకున్నావు? మళ్లీ ఎప్పుడు వస్తావు?" అన్నది రంగి.

సన్యాసి తలవంచుకుని మెల్లగా తనలో తానే మాట్లాడుకుంటున్నట్టుగా "నేను భగవంతుడి ఆజ్ఞను తృణీకరించాను. అందుకు ప్రతిఫలంగా శిక్షవిధించబడింది. నేటికాశిక్ష అఖరైపోయింది. నేను మళ్లీ నా స్వస్థానానికి వెళ్ళిపోతున్నాను" అన్నాడు.

"నువ్వు మామూలు మనుషులకు అర్థమయ్యేట్టు మాట్లాడడం లేదు నాయనా! అడుగడుగునా నీ ప్రవర్తన మాకు ఆశ్చర్యకరంగా కనబడుతున్నప్పటికీ ఇన్నిరోజులూ నిన్నిలా తర్కించి అడగలేదు. ఈరోజు నీఅంతట నువ్వే ఇక్కడనుంచీ వెళ్లిపోవాలంటున్నావుగనుక అడుగుతున్నాను. అసలు నువ్వెవరు? నీకథేమిటి?" అని అడిగాడు నాగన్న.

సన్యాసి మళ్లీ క్రిందకూచుని తన పూర్వకథని చెప్పసాగాడు.

"నేను భూలోకానికి సంబంధించిన మానవుణ్ణి గాను. దేవలోకంలో నివసిస్తూ వుండిన నిర్జరుణ్ణి! భగవంతుడొకనాడు నన్ను పిలిచి 'భూలోకంలో ఒకస్త్రీ చచ్చిపోవడానికి సమయం ఆసన్నమైంది తక్షణం అక్కడికి వెళ్ళి ఆమె శరీరాన్నుంచి ప్రాణాన్ని వేరుచేసి ఇక్కడికి తీసుకురా" అని ఆజ్ఞాపించాడు. నేనా ఆనతిని తలదాల్చి భూలోకానికి వచ్చాను. తీరావచ్చి చూతునుగదా, రోగంతో అలమటించిపోతున్న ఆస్త్రీ ప్రక్కన ఇద్దరు కవల బిడ్డలు పడివున్నారు. అప్పటికి కన్నైనా తెరవని పసినిసుగులు వాళ్లు. తల్లి చనిపోతే బిడ్డలగతి ఏంకావాలి! పైగా ఆ నిసుగులకు తండ్రికూడా లేడు. చూచి,

(48-వ పేజీ చూడండి)

# అదీ - ఇదీ

## "పథేర్ పాంచాలి"

కీ. శే. విభూతి భూషణ్ బంద్యోపాధ్యాయ రచించిన "పథేర్ పాంచాలి" నవల బెంగాలీ నవలా సాహిత్యంలో అగ్రశ్రేణికి చెందినది. ఇది ఒక బాలుని కథ. బాల్యంలో సహజంగా కలిగే అనుభవాలను, భావాలను శక్తివంతంగా రచయిత చిత్రించాడు. జననం, మరణం, జీవితం, వీటిలోని అగాధ విషాదాలను కరుణరసభరితంగా రచయిత చూపించాడు. ఈ ఉత్తమ నవలను ఒక కంపెనీవారు చలన చిత్రంగా నిర్మించడానికి కొంత కాలం క్రితం పూనుకొని ధనాభావంవల్ల కొంతవరకూ తీసి విడిచేశారు. బెంగాలీ గ్రామజీవితాన్ని అతిమనోహరంగా చిత్రించే ఈ నవలకు న్యాయం చేయాలనే మహదాశయంతో పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం ఈ చిత్రానికి పెట్టుబడి పెట్టి పూర్తిచేయించడానికి నిశ్చయించింది. ఇది నిజంగా హర్షించదగిన విషయం. ప్రజాజీవితంపై సాటిలేని ప్రభావం చూపుతూ దైనికోత్సవాల్లో ఒకటిగా మారిన చలనచిత్రాల విషయంలో కేంద్రప్రభుత్వాలు, రాష్ట్రప్రభుత్వాలు ఇలాటి శ్రద్ధ చూపిస్తూ, సహాయం చేస్తూఉంటే అనతికాలంలో మన చిత్రాల గౌరవం ఇంకా పెరగగలదు.

## తారల విలువ

కొత్తగా సినిమారంగంలో అడుగుపెట్టి ఒక చిత్రం నిర్మిస్తున్న ఒక తెలుగు యువక నిర్మాత ఇటీవల ఇలాగన్నారు:

"చిత్రాల విజయానికి తార అక్కర్లేదని విమర్శకులు ఆందోళన చేస్తున్నారు. కాని నిర్మాతల సాధక బాధకాలు వీరికి తెలియవు. సామాన్యజనానికి తారలు లేని చిత్రం తారలు లేని ఆకాశంలాగే నిరుత్సాహంగా ఉంటుంది. పట్టణాలలో చిత్రాలు విడుదలయినప్పుడు దూరదూరాలనున్న పల్లెటూళ్లనుండి ప్రజలు బళ్ళుకట్టుకొని, కాలినడకనా వచ్చేటట్లు ఆకర్షించేది తారలే. పల్లెటూళ్ళలోని సామరులకి చిత్రం నిర్మించిన సంస్థ గొప్పదనంగాని, డైరెక్టరు గొప్పదనంగాని తెలిసే అవకాశం లేదు. వారు చిత్రాల్ని తారలనుబట్టి జ్ఞాపకం ఉంచుకుంటారు. నాగేశ్వరరావు, సావిత్రి, భానుమతి ఇటువంటి తారలు వారికి జ్ఞాపకం ఉన్నంతగా మరోక డైరెక్టరు పేరో, కథా రచయిత పేరో జ్ఞాపకం ఉండదు. అందుచేత ఫలానా చిత్రంలో ఫలానా తార



ప్రతిభావారి "రేచుక్క" లో అంజలీదేవి (నానా) పేకేటి (అన్న).

# ★ అదీ - ఇదీ ★

ఉన్నారంటే ఇక తక్కిన వాళ్ళున్నా వచ్చి చూస్తారు.

ప్రేక్షకులే కాదు, డిస్ట్రిబ్యూటర్లూ, ఎగ్జిబిటర్లూ కూడా ఇలాంటి స్థితిలోనే ఉన్నారు. తారలు లేకుండా కొత్త వారినీ, అంత పేరులేనివారినీ పెట్టుకుని తీసిన చిత్రాలను తీసుకోవడానికి వీరు మీనమేషాలు లెక్కిస్తారు. బెట్టు చేస్తారు. వారి ఇష్టంవచ్చిన షరతులు విధిస్తారు. ఇంకా బాగా డబ్బు వస్తుండగానే ఎగ్జిబిటరు ఆ చిత్రానికి డబ్బు రావడంలేదని దొంగలెక్కలు చూపి, దాన్ని ఎత్తివేసి తారాబలంతో విడుదలయ్యే కొత్తచిత్రాన్ని ఆప్యాయంగా అందుకుంటాడు. అదే, తారలతో నిండిన చిత్రమైతే నిర్మాత డిస్ట్రిబ్యూటర్లకు, ఎగ్జిబిటర్లకు తానే షరతులు విధిస్తాడు. ఈ కారణంచేతనే తారలు లేకుండా చిత్రం తీసే పద్ధతిపై నిర్మాతలకు మోజు లేదు."

* * *

ఈ వాదనలో చాలవరకు సబబున్నది. తారలు గల చిత్రం నిశ్చయంగా డబ్బు చేసుకుంటుందనే గ్యారంటీ ఉంటే, దానికి ఏ విమర్శకుడూ తప్పు పట్టబోడు. ఈ గ్యారంటీ ఎన్ని చిత్రాలకున్నదీ అనేదే ప్రశ్న. కథ దబ్బుగా ఉన్నా, డైరెక్షన్ పేలవంగా ఉన్నా, కేవలం తారల్ని చూసి ప్రేక్షకులు వచ్చే మాట నిజమైతే ప్రేక్షకులను చూసి జాలిపడడం తప్ప విమర్శకులేమీ చెయ్యలేరు. అయితే అటువంటి స్థితిలో ప్రేక్షకులున్నారా అనేది సందేహగ్రస్తమైన విషయం.

అదీ కాక తారలు లేకుండా చిత్రం తీయడమనేది కొన్నిరకాల ఇతివృత్తాలకు, కొందరు దర్శకులకూ మాత్రమే సాధ్యమవుతుంది. నూటికి నూరుపాళ్లు వాస్తవికమైన చిత్రాల్లోను, సమకాలిక జీవితసత్యాలను చిత్రించే డాక్యుమెంటరీ చిత్రాల్లోను మాత్రమే ఇది వీలవుతుంది. లక్షలాది ధనం ఖర్చుపెట్టి తీసే జానపదచిత్రాలను కొత్త నటీనటులమీద ఆధారపడి తీయడం ప్రమాదమైన పని. అలాగే నటుల అభినయ నైపుణ్యంమీద ఆధారపడకుండా సినిమా అనేది ఒక ప్రత్యేకమైన, కొత్తరకమైన కళ అనీ, ఈ కళలో సూత్రధారుడు దర్శకుడనీ గుర్తించిన దర్శకులు మాత్రమే తారలు లేకుండా చిత్రాలు తీయగలరు. మిగతా వారు విధిగా తారల అభినయ నైపుణ్యం మీదనూ, గ్లామర్ మీదనూ ఆధారపడి విజయం పొందవలసిందే.

* * *

## హాలీవుడ్ నటుడు డానీ కేయీ

హాలీవుడ్ హాస్యనటుడు డానీ కేయీ ఈ నెలలో బొంబాయి వచ్చాడు. ఐక్యరాజ్యసమితివారి అంతర్జాతీయ శిశునిధి కోసం ఈయన ఒక వర్ణచిత్రం తీయబోతున్నాడు. ఈ చిత్రంలో తిండికి, గుడ్డకు మొహం వాచిన బాల బాలికల ఇతివృత్తం ఉంటుంది.

డానీకేయీ గౌరవార్థం బొంబాయిలో పారమౌంట్ ఫిలిమ్స్‌వారు తాజ్ మహాల్ హోటల్‌లో గొప్ప విందు ఏర్పాటు చేశారు. ఈ విందుకు బొంబాయిలోని ఫిలిం ప్రముఖులు, పత్రికావిలేఖరులు అనేకులు హాజరై డానీ కేయీకి బ్రహ్మాండమైన స్వాగతమిచ్చారు.

డానీకేయీ అసలు పేరు డేవిడ్ డేనియల్ కమిన్‌స్కీ. 1918 లో బ్రూక్లిన్‌లో జన్మించాడు. ఉత్తమశ్రేణి హాస్యనటుల్లో ఒకడుగా పరిగణన పొందాడు. ఇన్‌స్పెక్టర్ జనరల్, హాన్స్ క్రిస్టియన్ ఆండర్సన్ చిత్రాల్లో ఇతని పాత్రధారణం చూచినవారెవరూ అతనిపై అభిమానం పెంపొందించుకోకుండా ఉండలేరు. పారమౌంట్ వారు *Knock on Wood* అనే టెక్నికలర్ హాస్య చిత్రం, ఇతడు నటించినది ఇటీవలనే తయారుచేశారు. ఇది త్వరలో విడుదల కానున్నది. పారమౌంట్ వారు విస్టావిజన్ టెక్నిక్‌లో కొత్తగా నిర్మించిన టెక్నికలర్ చిత్రం 'వైట్ క్రిస్మస్'లో కూడా డానీకేయీ నటించాడు.

ఈ నెలలో బొంబాయి వచ్చిన మరొక హాలీవుడ్ నటుడు ల్యూఐర్స్. ఇతడు ప్రపంచంలో శాంతి సామరస్యాలను దోహదంచేసే ఉద్దేశ్యంతో ప్రపంచమతాలన్నిటిపైనా ఒక డాక్యుమెంటరీ చిత్రం తయారు చేస్తున్నాడు. జపాన్, ఫార్మోజా హాంగ్ కాంగ్, థాయిలాండ్, బర్మా దేశాలు పర్యటించి గతమాసం కలకత్తా వచ్చాడు. భారతీయ మతాలపై విషయ సేకరణ చేసేందుకుగాను బెనారస్, న్యూఢిల్లీ నగరాలకు వెడుతున్నాడు. రాబర్ట్ డంకన్ అనే కామెరామాన్‌ను సహాయంగా తీసుకుని బయల్దేరిన ల్యూఐర్స్ తనంతట తానే స్వయంగా ఈ డాక్యుమెంటరీ నిర్మిస్తున్నాడు. డానీకేయీ వలె ఇప్పుడు అంత ప్రసిద్ధిలో లేకపోయినా *All quiet on the western front* అనే యుద్ధ వ్యతిరేక చిత్రం చూచినవారెవ్వరూ ఇతన్ని మర్చిపోలేరు. సుమారు ఇరవైఏళ్ల క్రితం విడుదలైన ఈ చిత్రం ప్రపంచంలోని గొప్ప చలనచిత్రాల్లో ఒకటి. ఈ చిత్రం యుద్ధోన్మాదాన్ని అతినిశితంగా విమర్శించింది.

## ★ సినిమా వార్తలు ★

అన్నపూర్ణా పిక్చర్స్ వారు ఈ నెల 22, 23 తేదీలలో "దొంగరాముడు" చిత్రానికిగాను రెండుపాటలు రికార్డు చేశారు. రికార్డింగ్ వాహినీలో జరిగినది. సంగీత దర్శకుడు పెండ్యాల నాగేశ్వరరావు. జిక్కి పాటలు పాడినది. పాటలు వ్రాసిన వారు సముద్రాల రాఘవాచార్యులు గారు. కె. వి. రెడ్డిగారి దర్శకత్వాన ఈ చిత్రం జూలై 1 నుండి వాహినీలో సెట్స్‌కు వెళ్ళనున్నదని తెలుస్తోంది. మొదటి సెట్‌పై పని తెలంగితో ప్రారంభమవుతుందని తెలుస్తోంది.

* * *

వినోదావారు తమ "కన్యాశుల్కం" చిత్రానికి మూడు నాలుగు పాటలు ఇటీవల రికార్డు చేసినట్లు తెలుస్తోంది. శ్రీశ్రీ గారి "ఆనందం అర్ణవమైతే" అనేపాట, కీ॥ శే॥ గురజాడ అప్పారావుగారే వ్రాసిన "పుత్తడి బొమ్మా పూర్ణమ్మా" అనే గేయకథా రికార్డు చేసినపాటల్లో ఉన్నాయట.

* * *

విజయావారి "మిస్సమ్మ"కు నాలుగు రోజుల షూటింగ్‌తో మొదటి సెట్ మీద పని పూర్తయింది.

* *

"నిరుపేదలు" తీసిన గోకుల్ పిక్చర్స్ వారు తమ రెండవచిత్రానికి "[illegible] నాంచార్య పాంగ్రా" అనే మరాఠీ [illegible] కథను ఎన్నుకున్నట్లు తెలుస్తోంది. [illegible] పేరుకు అర్థం వదినెగారి గాజులు. [illegible] కథను బాగా మార్చని తెలుస్తోంది. [illegible]

రట. డైరెక్టరు "నిరుపేదలు" అసోసియేట్ డైరెక్టరుగా పనిచేసిన రజనీకాంత్ గారు.

* * *

కన్నడంలో తయారవుతున్న "బేడర కణ్ణప్ప" అనే చిత్రాన్ని తెలుగులో కూడా తీస్తున్నారని తెలుస్తోంది.

* * *

ఎ. వి. ఎమ్. వారి "సంఘం" విడుదల జూలై 10 కి వాయిదా పడినట్లు వినికిడి.

* * *

సోవియెట్ యూనియన్‌లో ప్రదర్శించడానికి రాహీ, దో బిఘా జమీన్, ఆవారా, ఆంధియాన్ చిత్రాలను రష్యన్లు సెలక్టు చేసినట్లు తెలుస్తోంది. ★

## న్యూస్ రీల్

(8-వ పేజీ తరువాయి)

నెహ్రూ ఆహ్వానంపైన రెండురోజులు ఢిల్లీ సందర్శిస్తున్నారని ఢిల్లీ వార్త.

—పరస్పరాంగీకారంపైన భార్యాభర్తలు విడాకులు తీసుకోడానికి ప్రత్యేక వివాహాల శాసనంలో చేయబడిన ఏర్పాటును రద్దుచేయాలనీ, స్త్రీలకు ఆర్థికంగా పురుషులతో సమానహక్కులు లభించే వరకూ ఇటువంటి ఏర్పాటు స్త్రీలకు హానిగా పరిణమించవచ్చునని 'అఖిలభారత మహిళామండలి స్థాయీ సంఘం కలకత్తాలో సమావేశమై ఒక తీర్మానంచేశారు.

—లావోస్, కాంబోడియా ప్రతినిధులు చీనా ప్రధానిచే జరిపిన చర్చల ఫలితంగా ఆ రెండుదేశాలలో యుద్ధవిరమణ గురించి ఒప్పందం కుదరవచ్చునని జెనీవా వార్త.

—అమెరికాలో గోధుమ కొల్లలుగా పండినందువల్ల పైవీడాదినుంచి గోధుమ సాగుచేసేభూమి తగ్గించడానికిగాను ప్రభుత్వం చర్యలు తీసుకుంటుందని అమెరికా వ్యవసాయశాఖ కార్యదర్శి బెన్సన్ ప్రకటించాడు.

—ఆయుధశక్తిని తగ్గింపచేసుకోడానికి లండన్‌లో మే 18 నుంచీ అమెరికా, రష్యా, బ్రిటన్, ఫ్రాన్సు కెనడాలమధ్య జరుగుతున్న సమాలోచనలు విఫలమై నేటితో ముగిశాయి.

—పసిఫిక్ మహాసాగరంలో హైడ్రోజన్ బాంబు ప్రయోగాలను మానేదిలేదని అమెరికన్ ప్రభుత్వం జపాన్‌కు తెలియచేసింది. (మానవలసిందిగా జపాన్ ప్రభుత్వం ఇదివరలో అమెరికాను కోరింది.)

—గ్వాటిమాలాలో యుద్ధం విరమించాలని భద్రతామండలి చేసిన సూచన ఫలితంలోకి రాలేదని తెలియపరుస్తూ, తగుచర్య తీసుకోవలసిందిగా భద్రతామండలిని గ్వాటిమాలా ప్రభుత్వం కోరింది.

—గ్వాటిమాలాకు వస్తే తమ నౌకలను

## సవరణ

గతవారం 58 వ పేజీలో "రాజా—పేదా" చిత్రం తాలూకు స్టిల్‌లో నటుడు ఎస్. వి. రంగారావు కాక డా॥ వి. కే. కొమరాజు అని సవరించుకోవలెనని పాఠకులకు మనవి.

అమెరికా నౌకాధికారులు తనిఖీ చెయ్యడానికి అంగీకరించబోమని నార్వే, పోలండ్ ప్రభుత్వాలు అమెరికన్ అధికారులకు తెలియచేశాయి.

—దుగ్గిరాలనియోజకవర్గంనుంచి ఆంధ్ర శాసనసభకి కాంగ్రెస్ అభ్యర్థి మేదూరి నాగేశ్వరరావు ఎన్నికైనారు. ★

# ప్రేమే దైవం

(49-వ పేజీ తరువాయి)

చూచి ఆ నిండుప్రాణాన్ని తీయడానికి నాకు మనస్కరించలేదు. అందుచేత భగవంతుడిదగ్గరికి తిరిగివెళ్లి ఆమెను మరణానికి గురిచేయడం సమంజసంకాదని విన్నవించుకున్నాను.

"తన ఆజ్ఞ నిర్లక్ష్యంచేయబడినందు వలన భగవంతుడికి కోపం వచ్చింది. నీకర్తవ్యాన్ని నెరవేర్చడం నీవిధి. నెరవేర్చకపోయావు కాబట్టి నీకు శిక్షవిధిస్తున్నాను. ఈక్షణంనుంచీ నీలోని దేవత్వం నశించిపోతుంది. నువ్వు మానవుడిగామారి భూలోకంలో నివసించు. ప్రతిమానవుడి హృదయంలోనూ ప్రచ్ఛన్నంగా దాగివున్న దేమిటి? మానవులకు అనుగ్రహింపబడని శక్తిఏది? వాళ్లు దేనివల్ల ప్రపంచంలో నివసించగలుగుతున్నారు?- ఈమూడు ప్రశ్నలకు సదుత్తరాలు తెలుసుకోగలిగిన తక్షణం నువ్వు మళ్లీ దేవలోకానికి రాగలుగుతావు అని ఆదేశించా డాయన.

"ఆరోజున నువ్వు చెరువు కట్టపైన నన్ను చూచి, ఇంటికి పిలుచుకుని వచ్చావు. కానీ నారాక నీభార్యకు కంటకప్రాయమైంది. ఐనా, నా దురవస్థని గుర్తించిన తర్వాత ఆమె నీకన్నా ఎక్కువగా నన్ను ఆదరించింది. అప్పుడు నేను ప్రతివ్యక్తిహృదయంలోనూ ప్రేమ ప్రచ్ఛన్నంగా దాగివుంటుందని గుర్తించాను. మొదటిప్రశ్నకు సమాధానం తెలుసుకున్నాను కాబట్టే ఆరోజున నేను మొదటిసారిగా నవ్వాను.

"ఒకరోజున శ్రీమంతుడొకడు మనదగ్గరికి వచ్చాడు. అతడింక కొన్ని గంటల్లో అసువుల్ని గోల్పోనున్నాడని నేను తెలుసుకున్నాను. అప్పుడప్పుడే నాలో మళ్లీ దైవికమైన శక్తులు వికసిస్తున్నాయి గనుక నేనా విషయాన్ని ఊహించగలిగాను. కానీ అతడు మానవుడు. తనకాళ్లకు బూట్సులే కావాలో, తనశవానికి చెప్పులే కావాలో ఆలోచించుకోలేని అజ్ఞు డాతడు! మానవుడు విధిచేతి కీలుబొమ్మ. విధిని తన యిచ్ఛానుసారం మార్చుకోగల శక్తి మానవుడికి అనుగ్రహించబడలేదు. ఆరోజున రెండవ ప్రశ్నకు జవాబు తెలుసుకున్నాను.

"ఈనాడు, నేనేబిడ్డల కోసమైతే తల్లిని జీవంతోవుండనీయ దలచానో ఆబిడ్డల్ని చూచాను. వాళ్లు తల్లి దగ్గరకంటే ఖులాసాగా కాలం గడుపుతున్నారు. భగవంతుడు ప్రేమస్వరూపుడు. మానవు లందరూ అతని ప్రతిబింబాలే కాబట్టి వాళ్లందరిలోనూ ప్రేమ నెలకొనివుంది. తండ్రి గతించినా, తల్లి లేకపోయినా అంతమాత్రాన మానవుల మనుగడ అంతరించిపోదు. పరమాత్ముడిదగ్గరనుంచీ ప్రసరించి, విశ్వమంతటా నిండివున్న ప్రేమవలన వా ళ్లేలాగో ఓలాగు జీవించగలుగుతారు— ఇదీ నేను మూడవప్రశ్నకు తెలుసుకున్న సదుత్తరం.

"నా ప్రవాస జీవిత మింతటితో పూర్తయిపోయింది. నేను వెళ్ళిపోతున్నాను. భగవంతుడి చల్లని చూపులు సదా మీపైన ప్రసరించును గాక."

సన్యాసి అత్యంత తృప్తిగా దివ్యుడుగా మారి ఆకాశానికెగిరి పోయాడు. సాగన్న, భార్యతో పాటు అతనికి నమస్కరించాడు.

★

# కాలక్షేపం

(6-వ పేజీ తరువాయి)

అమెరికావారు వచ్చి "నీ తపస్సుకు నేను మెచ్చితిని—నీకు ఆయుధాలు సైన్యాలు సప్లయిచేసి నిన్ను ఉద్ధరిస్తాను వత్సా! లెమ్మ! నావెంట రమ్మ" అని భస్మాసురాశీర్వాదము వలె నెత్తిమీద చెయ్యి పెట్టినట్లయితే, అంతటితో ఆ దేశాన్ని వారు ఆశీర్వదించినట్లేనా ? అనుగ్రహించినట్లేనా?

నిజంగా ఆలోచిస్తే, "ధర్మమేవ జయతే" అనే వాక్యంలో "ధర్మం ఒక్కటే జయించును" అనేమాట వరాల మూట. ధర్మంఅనేది ఒక్కటే- "నా ధర్మం" అని గాని "నీధర్మం" అనిగాని, వేర్వేరుగా లేవు. 'నా' 'నీ' గుణింతము 'నో' (No) అన్నారు పెద్దలు. 'నా' 'నీ' అనేవి మనం కల్పించుకొన్న పాతించుకొన్న సవతిపల్లి సర్వేరాళ్లు. అవి, శాశ్వతం గాడుండేవి కావు. నిత్యంకాదు సత్యంకాదు. నేను పీల్చేగాలి అనిన్నీ, నీవు పీల్చేగాలి అనిన్నీ వాయుబంధన చేయలేకుండా ఉన్నాము. నీ ఆకాశం నా ఆకాశం, నీ మబ్బులూ నా మబ్బులూ అని దెబ్బలాడుకోనలేకుండా ఉన్నాము. "నా" అనేది నై. "నీ" అనేది "నై" అన్నారు. "కోయీనహీ అప్న" అన్నాడు కమాల్దాసు.

"మనది అనేది ఏదీ లేదు"

దీనినే అంతర్జాతీయ వ్యవహార రంగంలో *One world Theory* (ఏకైక ప్రపంచ దర్శనం) అన్నారు. స్వధర్మం అనేది ఒకటిన్నీ పరధర్మం అనేది ఇంకొకటిన్నీ వేర్వేరుగా లేవు. నీలాభం నీవు చూచుకో. నీవు తరించే మార్గం నీవు చూచుకో,—నీవు యీ భవసాగరం తరించిన పరమహంసవైతే అంతే చాలు. లోకాన్ని తరింపజేసినవాడవవుతావు. ఇతరులకు ఉపకారం చేసినవాడవవుతావు. నీ కార్యం నీవు పరిత్యజించి పరార్థప్రాపకుడవు కానక్కరలేదు. ఇతరులకు ఉపకారం చెయ్యడం ఆత్మసంస్కారంకోసమే. నీ ఆత్మవికాసం, నీ ఆత్మపరిపక్వం అయ్యే మార్గం చూచుకొని, నిన్ను నీవు ఉద్ధరించుకొనడమే లోకాన్ని ఉద్ధరించడం - తన మేలుకూడా తెలియకుండా యితరులను ఉద్ధరిస్తామని చెప్పి "వృధా స్వార్థ భంగము గావించెడువార లెవ్వరో ఎరుంగ శక్యమే పరికింప?

★



తన శత్రువైన ఆనందరావు జబ్బుగా ఉండగా చెల్లెలు అతనికి సపర్యలు చేయడం సహించలేని అన్న.
జనతా వారి "పరివర్తన"లో సావిత్రి, నాగేశ్వరరావు.

పంచతంత్రం:



# లబ్ధనాశము



చిత్రరచన, నిర్వహణ: విశ్వామ్ముల నరసింహమూర్తి.




































"ఎంతో తెల్లనిది—ఎంతో శుద్ధమైనది—
లక్స్ టాయ్‌లెట్ సబ్బుయొక్క నురగ ఎంతో
మెత్తగాను, సువాసనగాను ఉంటుంది"

అని **ఎం. వి. రాజమ్మ**
చెప్పుచున్నది






మీ చర్మానికి ప్రతిరోజూ ఈ తెల్లని, శుద్ధమైన సబ్బుయొక్క రక్షణనిచ్చి ప్రకాశముతోనుండు యౌవన సౌందర్యాన్ని పొందండి ఎం. వి. రాజమ్మ ఇలా చెప్పుచున్నది "మీ చర్మాన్ని పట్టువలె మృదువుగాను, సౌందర్యముగాను నుంచుటకు లక్స్ టాయ్‌లెట్ సబ్బుయొక్క మెత్తని, సువాసనగల నురగవంటిది ఇంకేదీ లేదు. అది మీ సహజ సౌందర్యాన్ని బయల్పరుస్తుంది. నిలిచివుండే దాని మనోహరమైన సువాసనను మీరు మెచ్చుకొంటారు!"

గొప్ప వార్త!

శరీరమంతా సౌందర్యముగా నుండుటకు క్రొత్త
**పెద్దసైజు సబ్బు**
ఇప్పుడు దొరుకుచున్నది
ఇవ్వాళె దానిని వాడి చూడండి.

"...అందుచేతనే నేను నా చర్మమును సౌందర్యముగానుంచుటకు లక్స్ టాయ్‌లెట్ సబ్బునే వాడుతాను."

LTS 470 A-2 51